శ్రీ

# శారదావిజయము

గ్రంథకర్త,

కొడాలి సత్యనారాయణరావుగారు

ప్రకాశకులు,

టి. వి. రమణయ్య అండ్ బ్రదర్సు

నేషనల్ బుక్కుడిపో, రాజమండ్రి.



మొదటికూర్పు 1000 ప్రతులు

ముద్రాపకులు

కనుమూరి సుబ్బరాయ సోదరులు

స్కేప్ అండ్ కంపెనీ,

కాకినాడ.




1924



[వెల 0—12—0

# ఈనాటకమునందువచ్చు పాత్రలు

## పురుషులు

1 మాధవవర్మ:—

2 వీరవర్మ:—

3 కీర్తివర్మ:—

4 కూరవర్మ:—

5 విక్రమవర్మ:—

6 త్రిగుణోతు:—

7 రాముడు } చోరులు:—

8 పాపుడు

9 హాసనల్లీఖాన్ } రాజభటులు:—

10 శిలార్ బేగ్

11 వెంకటశాస్త్రి } బ్రాహ్మణులు:—

12 రామావధాని

13 భటుడు:—

14 సదానందమూర్తి:—

## స్త్రీలు

1 శారద:—

2 వృద్ధవేశ్య:—

శ్రీ

# శారదావిజయము.

## ప్రథమాంకము.

రంగము.—పాడుపడిన యొకయిల్లు.

(...నాథవర్మ చేఁకోల నిడికొని ప్రవేశించుచున్నాఁడు.)

నాదనామక్రియ:—ఏకతాళం.

...తఁ జేసె భగ-వంతుఁడు నాగతి
బంతమూని పలు-వంతలఁ బెట్టుచు ॥ఎం॥

1. తిరిగి తిరిగి వే-సరితిని గానియు।
పురమునందు మధు-కరము లభింపదు ॥ఎం॥

2. తొలిపుట్టున నే-రల బాధించితినో।
కలుగఁ జేసె ఫల-ములు నీనాటికి ॥ఎం॥

3. ఆకలికిని నే-నాఁగఁగఁ జాలనో।
హా! కరవయ్యె నే-యుండదె ధర్మము ॥ఎం॥

కష్టా! నా బ్రదుకెంతటి దుఃఖభాజనమైనది ?

చ. శిశుత్వమునందె తల్లి నను వీడి దివంబు నలంకరించె; నా
...ఁ డరణ్యసీమలను సంచుచునుండె విరాగియై తపం

బును, నీక న మొగంబుఁ గను పుణ్యులెవారలు? దిక్కులేని ప
క్కినయితటంచు జాలిఁగని గింజలు గుప్పెను వేయరైరిగా.

దయామయా! పరాత్పరా! పూలఁదాల్చిన చోటనే గట్టెల మ్మించు నీచెయ్దములఁ దలంచి యేమని విలపింతును? ఔరా! ఎంతలో నెంతవిపరీతము జరగినది.

సీ. భవ్యమందిరముల వాసంబుఁ గనునట్టి
వానికా? యీపాడు పడినయిల్లు
మృదుశయ్యలందున నిదురఁ జెందెడునట్టి
వానికా? యీ బూది పైని పడక
సతము రాజాన్నభో జనమొనర్చెడునట్టి
వానికా? యీ యుప వాసశాక
బంగారు జల్తారు పంచెలఁ గట్టెడు
వానికా? యీ చిన్గు పాతబట్ట

గీ. యీయవస్థల కేమిగా నీ! యిటులనె
బిచ్చమెత్తుక జీవింప వచ్చునంచుఁ
దలఁచుచుండఁగ నాదుసో దరికి నాకు
దైవమా! దూరముగఁజేసి నావె! తగవె?

హా! సోదరీమణీ! శారదా! ఎక్కడనుంటివో! ఏమని బాగ లుచుంటివో! ఏకాకినినై యేకిరియ నల్లాడుచుంటివో! ఏదుర్మార్గుని బాఱికిఁ జిక్కి తపించుచుంటివో! ఏయరణ్యసీమలఁ దోవఁదప్పి యే ఘాతుక మృగంబుల పాలఁబడితివో! ఏమనిదలంతును? ఎంతని విలపింతును? ఎంతని ధైర్యమువలంబింతమన్నను పొంగి, పొరలి, యుబికి, నన్ను వేధించు నీదుఃఖంబు నన్ను బాయకున్నది గదా?

మ. క్షుధవోగూటికిఁ గట్టుగుడ్డకును గా కుందెందె నేనొక్కఁ
బడి యుండంగలవారమంచును దలం పట్టె దైవ మీరీతి నె

కూఁడవై రాత్రింబవల్ గృశింపుమనుచుఁ గాఠిన్యముఁ జూపి, యీ
పుడమిఁ దిమ్మఱిఁ జేసితే! కటకటా! పూర్ణేందుబింబాననా.

దైవమా! ఈ లోకములోని కష్టములన్నియు నాకొఱకే సృజించితివా? ఈకష్టంబుల ననుభవింపఁదగి నీ కన్నులకుఁ గనుపించినవాఁడను నేనొక్కఁడనేనా? లోకరక్షకా! తల్లి లేకఁ, దండ్రికి దూరస్థుఁడనై, యిల్లువాకిలి లేకఁ, గూడుగుడ్డ లేక, నలోయని యేడ్చుచు నట్టులనే గాలంబుఁ గడపుకొనుచుండ నప్పటికిని నిర్దయుండవై నాసహోదరికిని నాకుఁగూడ వేఱుఁ జేసితివి. అంతటితో నైన నీమంట తీఱదయ్యె. నాపై నీకీ యకారణవైరంబుఁ గల్గుటకు నేను నీయెడఁ జేసిన మహాపరాధ మేమి? దీనదయాళూ! నీదీనదయాళుత్వ మెందుడాఁగినది? ఇంతవిశాలమగు పట్టణంబయ్యును, నెందఱినో భాగ్యవంతులఁ గలిగినదయ్యు నెంతటి సిరిసంపదలతోఁ దులఁదూఁగుచున్నను, నేమిలాభము?

గీ. అన్నమో! రామచంద్రా యటంచుఁ బెద్ద
యెలుగుచే నెంత గోలిడె నేని వినరు
తలుపుఁదీయరు, బీదవారలనుగనరు
పట్టెడన్నంబు నిడరిది యెట్టిగతియొ.

క్షత్రియకులసంజాతుఁడనై యుండియుఁ గాలమాన పరిస్థితు లిట్టిగతికిఁ దెచ్చుటచే మానాభిమానముల విడచి నోరుదెఱచి తల్లీ! కబళమమ్మాయని యఱచుచుండఁగా నొక్క మానవునకైన నాపైఁ గరుణరాదే? ఈపురజనుల హృదయంబులన్నియు నుక్కుముక్కలతోఁ జేయఁబడినవా యేమి చెపుమా? కానున్న నిట్టి కాఠిన్యమేల వహింతురు? ఔరా! కడుపులోఁ జిచ్చుఁబెట్టినట్లుగ దహించుకొని పోవుచున్నదిగదా? అక్కటా! ఆఁకటిబాధ యెంత చెడ్డది?

సీ. తడిలేమినాల్కపైఁ దడఁబడు మాటలు,
నడువగఁ గాళులా వడఁకఁదొడఁగె,

మెడఁదూలుఁ, గన్నూలిఁ బడెను, శారీరమా
శుష్కించె, దార్ఢ్యంబు శూన్యమయ్యె,
మది కేమిదోఁపనియుదు, మొందుఁజొరనీదు,
దుర్భరంబగు బాధఁ దోపఁజేయు,
సదురఁ బోసెదు, నెమ్మదిగ నుండఁగనీదు,
కడుపులోఁ జెయిఁబెట్టి కలఁచుచుండె,

గీ. ఇట్టివారలు యీపురి నెందఱుందురొ
వారలేగతి మనుచున్నవారొ; గాని
కటకటా యేరికైన నాఁ కంటి బాధఁ
గడచుటన దుర్భరంబగుఁ గాదె చూడ.

ఇట్టి బాధచేఁ దపించువారిని యాదరింపఁజాలని సంపన్ను లుండిన నేమి, లేకుండిన నేమి? ఆహా! ఏమియీమానవుల వెఱ్ఱిమమకారము.

గీ. పిల్లికేనియు బిచ్చంబుఁ బెట్టకుండఁ
బొట్టకేసేఁదినకఁ గూడఁ బెట్టిపెట్టి
చచ్చునప్పుడుఁ దమతోడ వచ్చునంచుఁ
దలఁచుటలు వెఱ్ఱియంచును దలఁపరయ్యె.

[illegible]ముష్టిసంగతి యెట్లున్నను నటుంచు,

గీ. కఱ్ఱలను జేతఁగొంచుఁ జీకాకుఁబడుచుఁ
గసరికొట్టుచు గెంటుచుఁ గఠినములగు
దూషణములాడి మితిలేని భీషణములఁ
దెలిపెడిఁ బ్రయోజకత్వంపు దివ్యమహిమ.

అంతియగాక,

గీ. కుంటియో సికు గుడ్డియో? కూలి నాలి
జేసికొనరాదె? యీదొంగ వేసములను

వేసికొననేల? మమ్ము నే । డ్పింపనేల
టచుఁ గుశ్శంకలను బచ । రించుచుందు.

కొండొక కాలంబున సమస్తైశ్వర్యములతోఁ దులఁదూగి, సకలభోగంబు లనుభవించిన నేను బరువుల మోయఁగలుగుదునా? సిగ్గువిడచి, సాటివారలు నవ్వెదరన్న రోసంబు లేకఁ జేయుచున్న యీ పనికే నెంతెయుఁ గుందుచుంటిని. దైవమా! నాకీ కష్టంబు లవశ్యానుభోక్తవ్యంబు లేనా? నాదారిద్ర్యమునకు విముక్తి లేదా? నేనిట్టుల వారి వీరిచేత నీడ్పింపులఁ బడుచుండవలసినదేనా? శరణాగతవత్సలబిరుదాంకితుఁడవు; ఆపన్నివారకుఁడవు; అనాథరక్షకుఁడవు. మాయట్టి వారిబన్నంబు లుద్ధరించవా! తండ్రీ నీకింతటిపగ జనించుటకు నేనొనర్చిన మహాపరాధ మేమి?

గీ. బాలతుఁడనౌట లోకాను । భవము లేదు
నిన్నుఁబూజించువిధము నే । నెన్నఁడెఱుఁగ
నేర్పనాతల్లిసనువిడి । నేలఁబాసె
నన్ను క్షమియింపరాదె నా । కన్నతండ్రి.

(అంతట వీరవర్మప్రవేశము)

వీర — ఎచ్చటనో ఆర్తారవంబు వినవచ్చుచున్నది. (అటునిటుఁజూచి)
ఈ బాలకుఁడెవ్వఁడైయుండును?

సీ. చినిగిపోయినపాతపం । చెనుధరించి
ధూళిగప్పినహృదయంబు । తోడఁ జంక
జోలె నొకదానితోడ ప । స్తులతోమాడి
నట్టుగాఁగాన్పడెడినీతఁ । డెట్టివాఁడొ?

అబ్బాయీ! నీపేరేమి? —

మాధ — (మాటాడకుండును)

వీర—అబ్బాయీ! నీపేరు చెప్పుటకే సందేహించుచున్నావు. కారణంబేమి!

మాధ—అయ్యా! మఱేమియును లేదు. బ్రదికి చెడినవాఁడనగుటచే పేరు చెప్పుకొనుటకు సిగ్గుపడితిని.

వీర—బ్రతికి చెడుటయనఁగా?

మాధ—పూర్వ మొకప్పుడు సమస్తభోగములతోఁ దులఁదూగి కారణాంతరములచే నీయవస్థకు వచ్చుటయే బ్రతికిచెడుట.

వీర—(తనలో) వీని కంఠస్వరమును బట్టిచూడగా

గీ. వెనుకనొకసారి యెప్పుడో విసినయట్లుఁ
దోఁచుచుండుటెగాక బం దుగుడటంచు
స్వచ్ఛమగుమాటచేఁ దేటఁ బడెడియిత్తఁడు
నాసహోదరిపుత్రుఁడో నా? (ఆలోచించి)యడిగెద.

మాధవవర్మా!

మాధ—మీరు దివ్యజ్ఞానసంపన్నులవలెఁ దోఁచుచున్నారే. లేకున్న నాపేరు తమకెట్లు తెలిసినది?

వీర—నీవెన్నఁడైన ననంతపురంబునకు వచ్చియుంటివా!

మాధ—అయ్యా!—నేనువచ్చియుండలేదుగాని మాయమ్మ దనపుట్టినిల్లు అనంతపురంబనియు నాకచట వీరవర్మ యనుమేనమామయొకఁడుగలఁడనియు నప్పుడప్పుడు జెప్పుచుండఁగా మాత్రము వినియుంటి.

వీర—అయ్యో! బాలకా! నీకెంతటియవస్థ పట్టినది!

సీ. పసిపాఁడవగునిన్ను వదలి నీజనయిత్రి
స్వర్గంబు జేరెనే? సద్గుణాఢ్య
జనకుండు వైరాగ్య మునుబూని తపసియై
విపినంబుఁ జేరెనే విబుధవర్య

పూర్వపువైభవం బులువమ్ముకొనుచు మీ
రేకాకులైతిరే? యీకరణిని
మధుకరమెత్తుచు మనుచుంటిరే మీరు!
యిల్లువాకిలిలేక నిల్గుచుండి
గీ. బందుగుఁడనయ్యు నేనిట్లు బ్రతికియుండి
క్షేమములవిచారింపక సిగ్గులేకఁ
గటకటా యెట్టిగతిలోన గాంచితి నిను
దిక్కుమాలిననాచెల్లి తెల్లవాఱ. 11

మాధ—అయ్యా! మీరెవ్వరు? నాస్థితికి మీరిట్లువగవంబని యేమి?

వీర.— నాయనా! నేనేమని చెప్పుకొనును?

మ. ఘనసంపద్విభవుండనయ్యు మిముల న్గష్టంబులోనుండఁజూ
చినపాపాత్ముఁడ,మూర్ఖచిత్తుఁడను, దుశ్శీలుండ,నీమేనమా
మను నేనేసుమివీరవర్మను, మహామాంద్యంబు తీండ్రింప నే
గననైతి న్మిమునింతదాఁక నపేక్ష్యాతి న్ధర న్బ్రోయఁగన్ 12

మాధ—ఏమీ! నా మేనమామ వగువీరవర్మవునీవేనా? హా! మామా! మామా!

మ. లలితానందవిశేషదాయకమహాలక్ష్మీవిలాసంబునై
గళల న్జిమ్మెడు మత్సహోదరిని నుగ్రక్రూరులై యెవ్వరో
బలవంతంబుగ దొంగిలించె,నిఁక భవ్యంబైన నాదివ్యమం
గళరూపంబును జూడఁగాఁదగిన భాగ్యంబబ్బునే? మాతులా 13

వీర—మాధవవర్మా! ఏమి! ముద్దుచెల్లెలు శారద దొంగిలింపఁబడిన దియా! ఎట్లు!

మాధ—మామా! అదియంతయు నేమో యింద్రజాలమువలె నున్నది. ఒకనాఁడు నేనుయథావిధిగ జంకజోలెనిడుకొని పురంబులోని కి భిక్షాటనంబునకై బోతిని; గాని ముచ్చటకేని పిడికెడు బి

చ్చ మెచ్చుటకు జేకూరదు మన గృహస్థులెల్లరు నింటింటికిం బోవుట యుత్తమంబుగాదని యీయూరిచెంగటనున్న యొకపల్లెకుంబోయి పిడంపుతంతులంబులసేకరించుకొని వచ్చుసరికిం జెల్లెలు గాన్పింపదయ్యె. అంతగోలపెట్టుచు నూరంతయుం గలయ వెదకితినిగాని సోదరిజాడ తెలియదయ్యె. ఎందఱినో విచారించితింగాని సరియగు సమాధానంబిచ్చినవారలే కానరైరి. మామా! ఈపురవాసుల విపరీతస్థితుల నేమని తెల్పఁగలను?

సీ. పొరుగూరుబిచ్చంబు । కొఱకుఁబోవుచునుంటి
నంచు మాతోఁ జెప్పె । ననెడివారు
మాయన్న గనుపించె । నా? యంచు నడుగుచు
నావీథిబోయెనం । చనెడివారు
దుర్మార్గులెవ్వరో । దొంగిలించియెత్తుకొ
రటువీడ భావ్యమా । యనెడివారు
మీచెల్లెలెవ్వరో । మేమెఱుఁగుదు
మటుపోయి యడుగుమం । చనెడివారు
గీ. పరిపరి వెఱ్ఱిగులను దెల్ప । వారెగాని
జాడల నెఱింగి తెలిపెడి । సత్పురుషులు
గానగారారు యొకరేని । కాలగతిని
దూఱుచేమని నేనేడ్చె । దో మహాత్మ. 14

మామా! ఈసంగతి నిట్లుండనిమ్ము.

శా. ఏయాధారము లేక దిక్కుసెడి నే । నీలాగు భిక్షాటనల్
జేయం జూచుచునూరనుండిరయయో । చీ! యన్నమోరామచం
ద్రా! యంచు న్విలపించుచుండఁగదయా । దాక్షిణ్యముల్ బూని యే
సాయంబుం బొనరింపఁజాలనిఖలుల్ । జన్మింపనేలా ధరన్ 15

ఏమానవుని దిలకింతుమన్నను తమయైశ్వర్యములను, తమపటాటోపములను జూచుకొని మురిసి తబ్బిబ్బులగు వారలేగాని యాదరణంబునఁ జేరఁదీసి పిడికెడు కబళం బిడఁజాలని యిట్టివజ్రకాఠిన్యహృదయు లిట్టి తుచ్ఛులుండిన నేమి, మండిననేమి? మామా! చూడుము. నాయవస్థ యెట్లున్నదో?

గీ. అంగములు సన్నగిల్లె వ[illegible] టాడఁజాల
కుంటి లేవంగఁజాల నా యొడలు నడఁకు
నాల్కపైఁ దడిలేదు నాకు నిట్టి
యిక్కటులు గల్గునంచు నే నెంచనైతి 16

అయ్యో! మామా!

ఉ. సోదరి యెంతగా నెటుల సుక్కుచునున్నదొ యంచు నేష్వనా
బాధ భరింపలేక నిటు వచ్చె నవస్థలటంచుఁ గుందనా
ఆదరణంబు లేదని యహర్నిశముల్ మదిఁజింత నొందనా
యేదియుఁదోఁచ కిక్కరణి నేడ్చుచు నుంటిని సుమ్ము మాతులా 17

ఇట్టియుగ్రచాట్లఁ బడుచుండియు నాయవస్థలకుఁ గుందుచు దైవ విధికి దూరుచుఁ జావక నిట్లు జీవచ్ఛవంబనై యింకను బ్రతికి యున్నాఁడ.

వీర—కుత్రా! నీవంతటి యవస్థలోనున్నను జూచుచు నూరకుంటకు నీ యూరంతయు గొడ్డుపోయినదియా యేమి ?

మాధ—కాకున్నచో నేనాత్మహత్యకేఁ బ్రయత్నింపకుందునుగదా!

వీర—బాలకా! నీవంతటి ఘోరకృత్యంబునకుఁ గూడఁ బూనుకొంటివా! ఎంతమాటవిననైతిని:—

మాధ—మామా! సహోదరీ వియోగంబును భరియింపఁజాలకను, ఈపురవాసుల విపరీతస్థితిఁ గాంచి నాదుర్భరజీవితంబును వ

లంచుకొనుచుఁ జేయఁదగిన కార్యం బేమియుఁ దోఁపక నట్టికృత్యంబునకుఁ గడంగితి.—అటుల నే నాత్మహత్యాపాతకంబున కొడిగట్టుకొని యురిపెట్టుకొనుచున్నంతలో నెవ్వరో యొక్క మహానుభావుండరుదెంచి నన్ను మందలించి, నాయురిత్రాడు లాగివైచి, నన్నుద్ధరించుటకై తనయింటికిఁ గొనిపోయెను; గాని భగవంతుఁ డన్యథా తలంచి యచిరకాలముననే వానినిఁ గూడ మృత్యుదేవత లాగికొనిపోయినది. అందుచే మఱల నెప్పటి యట్ల నాకష్టంబులకు నేను పాల్గొనవలసి వచ్చెను.

వీర—కుత్రా ! గతజలసేతుబంధమునకై విచారించిన నేమి ప్రయోజనము ! ఎట్టివారికేనియుఁ గష్టములుతప్పవుగదా ! బాయనా ! కష్టశుభములు కావడికుండలవంటివి-నీవునా వెంటరమ్ము. నీవింకఁ గష్టంబులఁగుడువఁబని లేదు. నీ కేకొఱంతయు రానీయక నా పుత్రునితో సమానముగ నాదరింతును-లెమ్ము.

మాధ—మామా! విపులదుఃఖార్ణవమునఁ బడి కొట్టుకొనిపోవుచున్న నన్ను తా మేరీతి నాదరింపఁగలరు-చూడుఁడు:—

సీ. కని, పెంచి, పెద్దవా ◌ నినిజేసిపోయిన
మాతల్లి నేక్రియ ◌ మఱచువాఁడ
తపసియై కాననాం ◌ తరముల కేగిన
మాతండ్రి నేరీతి ◌ మఱచువాఁడ
గడియయైనను నన్ను ◌ విడనాడియుండని
మాసహోదరి నెట్లు ◌ మరచువాఁడ
సర్వభోగములిచ్చి ◌ సతతంబుబోషించు!
మాసంపదల నెట్లు ◌ మఱచువాఁడ

గీ. పొట్టకును గూడుగట్టంగ ◌ బట్టలేక
ఱాయినై చిరకాలంబు ◌ బ్రతుకుటకయి

మానముభిమానములనెల్ల మంటగలిపి
చేరుటొప్పునె? మీయింట సిగ్గులేక!!

వీర—అబ్బాయీ! ధనవంతులకేమి, బీదవారలకేమి, దైవవిధివలన కష్టంబులుగల్గుచుండును. ఆపత్కాలంబునఁ జలింపనివాఁడే గుణవంతుఁడు. కాఁబట్టి వగపువీడి నావెంటరమ్ము. శారదాన్వేషణార్థమై వెంటనే చారులఁబంపి వెదకించెదను. మనముగూడ నశ్రద్ధచేయకఁ గొన్నితావుల వెదకుదము—లెమ్ము-సన్నద్ధుఁడవు గమ్ము.—

మాధ—మామా! నీవెంతచెప్పినను నామనంబునకు నచ్చకున్నదిసుమా! ఏమందువా?

సీ. కాలవశమున వాటిల్లు కష్టములకు!
వగచుచుండియు బంధుల పంచఁజేరఁ
గలుగునీర్ష్యయు నప్రతిష్ఠ గణనఁజేయఁ
దరమె బ్రహ్మకు మఱి వాని తాతకేని.

వీర—నాయనా! నాయెడలనేనా నీకట్టిభావముదయింపవలసినది! నీవు బాలుండవు. లోకానుభవమెఱింగి మాటాడుము—ఓయి పిచ్చివాఁడా! ఎందులకీ యక్కఱకురానిమాటలు. లే లెమ్ము.—

మాధ—మామా! నీవు వారక్తబంధుండవైనంతమాత్రమున నా మేనయత్తకు నాపైయాదరభావముదయించునని యెట్లు చెప్పఁగలవు?

వీర—ఆప్రసంగములన్నియు నావల ముచ్చటించుకొనవచ్చును. కాలవిళంబమొనర్పక రమ్ము.

మాధ—కానిండు పెద్దలమాటల వినకపోవుటయేల! (తనలో) హా! హా! దైవమా! ఎంతచేసితివి?

పూరీకల్యాణి:—రూపకం.

దేవా! సీమునఁ గృప - భావింపక లేవైతివి!
ఈవిధమునఁ గాసిపెట్ట - నేమి నేరముఁ జేసితినో ॥ దే॥

1. సిరిసంపదలావునను - హరియించితి వెంత ఘోరమిా
చిరుత నిలువనీడ లేక - జేసితి వేమందునునో ॥ దే॥

2. తల్లిదండ్రులఁ గోలుపుచ్చి - చెల్లెలి దూరముగ జేసి!
యుల్లమున నేమని సంతోషము - నొందుచుంటివో ఎరుగఁ జాల ॥ దే॥

3. వారివీరి పంచల - నిల్వఁగఁ జేయుచుఁ బంపుచుంటివి!
ఆరీతిగ సకలభోగము - లనుభవించిన బాలకు నిటు ॥ దే॥

మ. వరుసన్ బాధలు దీర్చియొందఱో భుజిం । పన్ ముచ్చటన్ గొల్పు సుం
దరహర్మ్యంబును గోలుపుచ్చి పరపం । చన్ జేయుచున్నావు మా
సిరిసంపత్తులనున్ హరించితివి నీ । చిత్తంబునం దింతను
గ్ర్భరమా యాగ్రహమూన నేమి కతమో? । భావింపలేనైతిఁ గా. 20

ఓయార్తత్రాణపరాయణా!

మ. తలిదండ్రుల్ మఱి వేఱు లేరు సిరియంతంబందె నా ముద్దు చె
ల్లెలు దుర్మార్గులవాతఁ జిక్కెఁగద యే । లీలన్ ననున్ బ్రోతువో
తలఁపన్ లేదు మనంబునందున దురం । తంబైన దుష్కార్యముల్
దొలఁగం జేయఁగదయ్య యిక్కటులనెం । తో వే్రిసు నారాయణా.

వీర—మాధవా! ఏల జాగొనర్చెదవు. సన్నద్ధుఁడవు కమ్ము.

మాధ—మామా! జాగేమియును లేదు. వచ్చుచున్నాఁడను. సన్నద్ధుఁడనగుటకు నాకడ నేమున్నది?—చూడుము!—

గీ. మూటలంగట్టగా వస్త్ర । ములును లేవు
పాత్రయును లేదు ద్రవ్యమా! । పైస లేదు
జోలెయును నేను సిద్ధమె । చోటికేని
వచ్చుటకుఁగాని దుఃఖమే । బాయదయ్యొ.

అయ్యో! కానున్నది కాకమానదుగదా. నడువుఁడు. (నిష్క్రమింతురు)





శ్రీ

# శారదావిజయము.

## ద్వితీయాంకము.

[కల్లుముంతతో సురానందుఁడు ప్రవేశము]

ధన్యాసి—ఏకతాళం

కల్లా! నీదర్శనము! వల్లాధన్యతగాంచె!
నుల్లము వేడుకరంజిల్లె నేత్రములెంతో ॥క॥
భారతభూమినిల్వఁగ నీడనిచ్చితివి!
పాలించుచుండె సుఖ ప్రథమమ్మ యోతాటి! ॥క॥
తనువులఁబెంచినా ధనధాన్యములనిచ్చి!
తగుపోషణము జేసి! దనరుచుంటివి తాటి ॥క॥

(స్వగతము) నాకుమావాండ్లు నామకరణముఁ జేయుటలో నేమియుఁ బొరఁబడలేదు. ఈమత్తుచేతనప్పుడప్పుడు నన్ను నేనే మఱచుచుందును. లోకులన్నఁ బులుగాకులు. వాండ్లు నన్నుఁజూచి హేళనలకుఁగడంగుదురు. వాండ్లకేమి తెలియును దీనిలోనుండు రుచి! సురాపానములోనిరుచి వచుల నెఱింగి దానిసారమును గ్రహించుటచేత నేగా దేవతలకు సురలని పేరువచ్చినది? త్రాగలేనివాఁడు త్రాగుఁబోతని వేమన్నగారు కూడా విశ్వసించినారు. వ్యాసులవారుగూడా దీనిసంగతి నెఱిఁగియేయున్నారు. వారికన్న మనమేమితీసిపోయినాము సురాపానము విశేషముగా

గ్రంథములలో వ్రాసినారో తెలియకుండావున్నది. ఒక్కసంగతిమాత్రమున్నది. నిర్మలమైనచిత్తముతో నేదియైననొకపని చేయవలయునన్నచో దానికిఁ జక్కని మార్గము సురాపానమే. సురాపానము కులగోత్రములఁ జెఱుచునఁట; దుర్వ్యాసనట; పాపకార్యమట; ఇంకా యేమోయేమోయట. వాండ్ల మొగము. వాండ్లకేమి తెలియును? తపస్సుచేయవలెనన్నను గూడ సురముఖ్యముగాఁద్రాగవలసినదే. మాబోటిగొప్పవారము సురయనుపేరుతో త్రాగితే గౌరవభంగముగా నుండునని తలంచి కాచి కాచి వడఁగట్టి సీసాయములలో బిగించి యెగుమతిచేయించినారు. ఈలా మమ్ములను గౌరవముచేయకున్నచో మాగతియేమి కావలసియున్నది. (అటునిటుఁజూచి) ఈయన యెవ్వరో యిక్కడ కొంగజపముచేయుచున్నాఁడు. ఈయనకుఁ జల్లఁగా దీనిరుచి జూపించి యానందములోఁ బడవైచి నాయంతవానినిగా నొనర్పవలెను. కాని యీతపోనిధి నాకుఁ జిక్కునా? ఏలచిక్కకుండును. రాజులు, మహారాజులు, రాజాధిరాజులు చక్రవర్తులంతటివారే దీనిని లెక్కలోఁబరిగణించుచున్నప్పుడు యీయన యొక లెక్కయా? ఎందఱు దీనిని గౌరవించనిదే దీనికింత వ్యాపకము గలిగినది? ఇదిలేని పల్లెలేదు. పట్టణములేదు. దీనినాధారముఁజేసికొని యెందఱెందఱు బాగుపడి కన్నులు నెత్తికెక్కి మిట్టమిట్టచూచుచున్నారు. ఇంతమందికాధారభూతమై ఆనందకరంబై వెలుంగు దీనిని అమ్మయ్యో—నాప్రాణములతో వదలఁగలనా? వదలఁజాలను. ఈమునీశ్వరుని పలుకరించెదఁగాక—ఓమునీశ్వరుఁడా!

విక్రి—(ఊరకుండును)

త్రాగు—చప్పున నన్ను బ్రాహ్మణుఁడనుకొనునేమో. కొంచెము విపరీతముగ మాట్లాడెద. (ముట్టుకొని) ఓయీ! నిన్నేనయ్యా! పిలిస్తే పలకవేమయ్యోయ్

విక్రి—(కనులు తెఱచి చూచి) ఎవరు నీవు?

తాౢగు—నా యవారమంతా తెల్పుతాగాని నీవెవరవో నీదంగతేందో యీజపమేంటో కాస్త చెప్పు.

వికౢ—నేనా? శ్రీహరిచరణారవిందభజనాసక్తుఁడనై యీయేకాంత ప్రదేశంబున నిశ్చలమనస్కుఁడనై యుంటిని.

తాౢగు—తపచ్చేత్తువుండావన్నమాట.

వికౢ—అవును.

తాౢగు—అట్టయితేమరి జడలూ, గడ్డాలు, మరి యింకా రుద్రాచ్చలు యియన్నిమేయి.

వికౢ—లభ్యపడలేదు. అదియునుగాక నాకీవిరాగత్వము నూతనముగాఁగలిగినది.

తాౢగు—ఏంటీ ! సంగతిచెప్పవూ? ఎక్కడన్నాకన్న మేసి పారిపోయొచ్చావేంటి.

వికౢ—అంతటి ద్రోహములెన్నఁడొనర్చినవాఁడఁగాను—

తాౢగు—అయితే, దొంగతనము ద్రోహమేనంటావా?

వికౢ—కాదా మఱి—

గీ. జారచోరత్వములు దురాశయు నబద్ధ
మాడుటయు, త్రాగుటయు జూద మాడుటయు దు
రాగతంబులటంచు శాస్త్రములు ఘోష
పెట్టుచుండుట నెన్నఁడు వినవె నీవు"

విధివశంబున నాకీగతి సంప్రాప్తమైనది. కాని ద్రోహకృత్యంబులొనర్చివలాయితుఁడనైవచ్చినవాఁడనుమాత్రముకాను.

తాౢగు—నాకుచూస్తే నీవు గొప్పోడవులాగుండావే!

వికౢ—వెనుకటి దినములలో—

తాౢగు—నీకు పెళ్ళాబిడ్డలున్నారా?

విక్ర—అసంగతులిప్పుడు నన్నేమియునడుగనలదు. అయిపోయినవాటిని మఱల జ్ఞప్తికిఁదెచ్చి యేలవిచారపెట్టెదవు? నీదారినినీవుపొమ్ము. ఇంతకృష్ణారామాయనుకొని సుఖముగా కాలమును బుచ్చుకొందును.—

త్రాగు—అదికాదయ్యా! ఏమివచ్చావోవచ్చావు. ఆకృష్ణారామాగోవిందా అనుకోడానికే నేను నేర్చుకున్నమంత్రం వుపదేశంచేస్తే నాపేరుచెప్పుకొని బతుకుతావనియడుగుచున్నానులే. ఆమంత్రం నీవు నేర్చుకోకపోయావా, భోగవంతుఁడు కనపడనేకనవుడడన్నమాట—

విక్ర—అయ్యా!—భగవధ్ధ్యానమునకుగల మహామంత్రమిదివఱకే నేర్చుకొనియున్నాఁడను. ఇంక నీయొద్దనెందు నూతనోపదేశమేమున్నది?

త్రాగు—దేవున్నికొల్చుకోవలాఅంటేయిశారంపనికిరాదు. చంతోచం వుండాల. నాకెప్పుడూ కళ్లకి పత్తెచ్చమే. తల్చుకొన్నప్పుడల్లా మారామచంద్రయ్య ఎదఁరుగుండావచ్చి నిలుసుంటాఁడు. దానిగమ్మతు నీకు వూదానా మల్లీ వొదలవుసుమీ?

విక్ర—నాకు నీవాక్యములు బొత్తుగా యర్థములగుటలేదు.

త్రాగు—నామాటలు తెల్డానికి యెల్లాయీలవుతుంగయ్యా? తెల్చేలాగు చెబుతాయినుమరి. దేవుడు పెత్తెచ్చంఅవాలంటే మనచ్చంతా నిర్మలంగా వుండాలంటావా లేదా?

విక్ర—ఉండవద్దామరి!—

త్రాగు—ఆ! దారికిరా! మారాజా! దారికిరా! అందుకనే చట్కావోటుంది!—

విక్ర—చెప్పెదనన్న ఆచట్కా వినఁదగుదునేని చెప్పుము!—

త్రాగు—చెప్పినవిని యూరకుండుటగాదు. చెయ్యాలి!—

విక్రి—అవశ్యముగా—నిజముగా నమ్మహాత్మ్యుని యహర్నిశలుస్మరించుకొనుచుంతటిస్థిరచిత్తమును గలుగఁజేయుమాహాత్మ్యమందుఁగలదేని యాచరింపకుందునా?

తాగు—అదీసాగను (గ్లాసులోకల్లుపోసి యిచ్చి) ఇదేందో తెల్సునా?

విక్రి—ఇది కల్లు!—

తాగు—కాదయ్యా! చదువుకొన్న పండితు లేమంటారు?

విక్రి—సురయందురు.

తాగు——దేవతలందఱికిని సురలంటారని మాపెద్దోళ్లుచెబుతూవుంటే విన్నాను నిజమేనంటావా?

విక్రి—నిజమే!—

తాగు—వాళ్లుతాగుతూవుంటారనె దీనికాపేరుపెట్టారుగందా. మనము తాగితే తప్పేమిటంటా?

విక్రి—పూర్వయుగములమాట మనకక్కఱలేదు; గాని యిక్కలికాలమునందు దానిని నిషేధించిరి.

తాగు—కలికాలంలో తాగినోళ్లు లేరంటావా?

విక్రి—ఉండవచ్చును. కాని మనకావిచారణ మిప్పుడేల?

తాగు—ఓయిపిచ్చవాఁడా! దీనిమహత్తు నీకు తెల్సునా?

విక్రి—తెలియకేమి? తెల్సును. దీనిని సేవించినవారిని

గీ. ఛీయటందురు పెద్దలు ¶ చేరనీరు
బంధుగులునోటవచ్చును ¶ వాసన తల
బిద్దలుగఁజేయు వాగించు ¶ పరమనిచ
కార్యములకునుబురిగొల్పుఁ ¶ గాదెకల్లు.

తాగు—అటులైన బాగా తెల్సినోడవన్నమాట! —సూసుకో దీంత మాసా.

గీ. నిర్మలంబుగనుండును – నీమనస్సు
తగినచందంబొచమిచ్చునా – దైవమెట్లు
నీకుపెత్తెచ్చమైకరు – ణించివరము
లిచ్చుఁగాఁబట్టిదీనిని – పుచ్చుకొమ్ము.

విక్రి—ఓహో! చివఱకు నాకు హితోపదేశ మొసఁగ్చునది సురాపాన మహిమమా! చాలుచాలు!

ఉ. ఆర్యులుతొల్లివ్రాసినసమ – హాత్తరశాస్త్రములందునిద్దదు
ష్కార్యమటంచుఁదెల్పిరటు – సల్పినరాగతుఁడన్నఁబేరితో
నార్యధరాతలంబునను – బ్రాణములన్ భరియింపనేర్తుమే
యార్యుఁడవయ్యునన్నుచెడ – నాడఁగఁజూతువదేలమిత్రుఁడా

త్రాగు—నీకూకడాపుట్టింది యీదుర్బుద్ధి! వెఱ్ఱిమొఱ్ఱిసిద్ధాంతాలు కల్పించిన బ్రాహ్మర్లోనేవిపరీతంగా సీసాలూలొట్లూమోగరేస్తు వుంటే నీకేటీపరంతీసిందయ్యా!

విక్రి—బ్రాహ్మణులమీఁద నెందుల కట్టి విపరీతపువాదులు వేయఁ బ్రయత్నింతువు? ఎవ్వరోదుచ్ఛలుకొంద ఱట్టివక్రగతినిసంచరించుచున్నారని వర్ణమునకు వంకలుపెట్టెదవేల!

గీ. ధార్మికులుధర్మశాస్త్రవే – త్తలుమహాత్త
రంబులగువిద్యలనునేర్చి – ప్రజలకెల్ల
నీతిబోధకులయిజగ – త్ఖ్యాతిఁబొంది
నట్టివిప్రులదూషింప – నగునెనీకు.

త్రాగు—నేనింతవఱకు యెవరొన్నీ తెలుపకుండావుండఁబట్టి నన్నేమో అనుకున్నావుగాని నేనూబ్రాహ్మణ్ణేసుమీ!

విక్రి—అందులకనే నీకుఁగూడ నిట్టికార్యము కూడదని విన్నవించుచున్నాఁడను.

తా)గు—తగునాతగదా యనువిచారణ మనకక్కఱ లేదయ్యా, నీకు నిజముగా తపశ్శక్తివలన భగవంతుని కనుకోవాలని అనుకుంటావా, సురాపానమే సర్వవిధముల శ్రేయము. ఎట్లా అంటావా? విను.

గీ. భయముఁదోపించునీవస ౖ ప్రాంతమందు
మనుజులెవ్వరునిటు రారు ౖ గనుక నీకు
పిఱికిదనమునుబోఁదోలి ౖ గుటినిగూర్చు
దైవమునుజూతువీసుర ౖ ద్రాగుదేని.

అయినను నీకిన్ని పరీక్షలెందులకు! ఈగలాసుతో ముందు రవ్వంత త్రాగిచూడుము. రుచిగానున్నదా నేను వేఱుగఁజెప్పనక్కఱయే లేదుగదా? వెగటుగానున్నదా, అప్పుడునన్నడుగుము.

విక్రి—అట్లయిన దీనిలో నంతటి మహాత్మ్యమున్నదనియే నీనిశ్చితాభిప్రాయము.

త్రాగు—ఆహా! ముమ్మాటికి!

విక్ర—సరే. కానిమ్ము. నీమాట నేలగాదనవలయును. ఇటుఁదెమ్ము.

త్రాగు—(ఇచ్చును)

విక్ర—(త్రాగి) మిత్రమా! తియ్యగా నున్నదేమోయి! కాని కొంచెము ముందు. (కొంచెమూరకుండి) నీవు చెప్పినమాట యథార్థమే. ఇంకనున్నదా?

త్రాగు—నేఁజెప్పినసమ్మువారెవరు? పిచ్చిపుల్లాయకిందఁగట్టివై తురు ఇదుగో (ఇచ్చును విక్రమవర్మ త్రాగును)

విక్రి—మఱినీవు త్రాగవేమి?

త్రాగు—ఎక్కడనైనా తనకు మాలిన ధర్మమున్నదా నాయనా! త్రాగకేమి యిదుగో (లోట్టయెత్తి త్రాగును)

విక్ర—నీకు గ్లాసుకూడ అక్కఱయే లేకపోయెను!

త్రిగు—నాకేందులకు?

విక్ర—ఇదిగో మిత్రమా! కాశీనగరమంతయు నాకన్నుల యెదుటనే యున్నది అదుగో విశ్వేశ్వరుఁడు. అన్నపూర్ణావిశాలాక్షి. కాలభైరవుఁడు. ఓహో! ఏమిదివ్యసుందరవిగ్రహములోయి! (కన్నులుమూసికొని)

గీ. నదులు, కొండలు చెట్లుము న్నగునవన్ని
కలిగి మనకండ్లకున్నింపు గలుగఁజేయు
భూమియుల్లదెసంపూర్ణ ముగనుదిరుగు
వారుచున్నది కుమ్మరి సారెరీతి.

ఓహోహో! ఏమిరాముఁడయ్యా! దివ్యమంగళవిగ్రహమూర్తి. నీలమేఘశ్యాముఁడు. సీతామ్మవారుకూడ నున్నదే యెడమప్రక్కను! అదుగో ఆంజనేయుఁడు; కుప్పిగంతులు వైచుకొనుచు ఆనందసాగరంబున దేలియాడుచున్నాఁడు.

త్రిగు—లక్ష్మణస్వామిగూడ నున్నాఁడా?

విక్ర—ఆయనపేరెత్తకయ్యా నాయనా? ఆయన నాకు నిత్యదేవుడే. ఆయననుతల్చుకుంటూనే యీలావచ్చాను:—

గీ. భార్యచచ్చెను రాజ్యమూ పరులచేతఁ
జిక్కెఁ గొడుకును గూఁతురు దిక్కులేక
నల్లలాడుచు నున్నట్టి లధమగతిని
జూడఁజాలక నేఁ జేరి నాఁడ నిటకు.

ఇందులో నేమిమహత్తు గలదోగాని మిత్రమా! హంసతూలికాతల్పముమీఁద నిట్టెపడుకొనఁగానే సిదురపట్టినట్లుగా నిద్ర దానియంతట అదేవచ్చుచున్నదేమోయి?

త్రిగు—అటులైనఁ గొంత తడవు పరుండుము. నిదుర లేచిన వెంటనే మఱల మనకొఱకు సురను సంపాదించి సిద్ధముగానుండెద.

విక్ర—అంతవఱకు నన్నిచ్చట నే పరుండుమ నెదవా?

తాౖగు—పరుండుము. నేనిప్పుడేవచ్చెదను. (వెడలును)

విక్ర—(పరుండి) శారదా! శారదా! (లేచి) ఏదీశారద! అమ్మ! యెచ్చ టనున్నావమ్మ. (ఏడ్చుచు)ఏయరణ్యములో దిక్కులేక ఆ యన్న తోఁగూడి యుంటివో! మాధవవర్మ! నీవునాకొడుకవేనా? నాకొడుకవేయైనచో నన్ను వెదకుచు వచ్చియుండవా? (మఱల బరుండిలేచి) నేను రాజునా? రాజునైతే నాసింహాసనమేది? మంత్రిలేరే? నాభార్యయేది? ఛీ ఛీ వెధవ కలవరింతలు? రాజ్యమెక్కడ-నేనెక్కడ-ఇది యరణ్యమాయెను- రాజ్యమెట్లువచ్చును- (మరలపరుండిలేచి) అయ్యో!-నేనిప్పుడెచ్చటనుంటిని! నామిత్రుఁడేడి? ఇది మనుష్యసంచారములేని యడవిగనుక భయమువలన నిట్లు కలుగుచున్నది. నాకుభయమెందులకు! నేను దాగినది సుర కాదా! సురాపానమొనర్చినచో! నాకుభయ మెంతమాత్రిమె లేదని నామిత్రుఁడు చెప్పెఁనాడు ఛీ! ఛీ! దయ్యమేవచ్చునో, భూతమే వచ్చునో రాసిమ్మ రొమ్ములు పగుల చీరి నెత్తురుపీల్తును (పరుండి) హా! చచ్చితి చచ్చితి. మిత్రమా! త్రాచుపాము. నాశరీరము నిలువదు. విషముతలకెక్కుచున్నది. రమ్ము రమ్ము నాచేయిఁబుచ్చుకొని లేవదీయుము (లేచికూర్చుండి) నాశరీరమునకుఁ గాట్లెక్కడను లేవే? నన్ను పామెచ్చటఁ గఱచినది! ఈకలవరింతలేమి? ఇట్టికన్ను మూసినతోడనేరాజ్యాధికారమువచ్చుట—పాముకఱచుట— యీవిపరీతములేమి! సరే! నేనిఁక నిద్దురయేపోను. ఒక్కొక్కప్పుడు కలలోఁగాన్పించే విపరీతము లన్నియు నిజమవునని పెద్దలవల్ల వినియుంటిని. నాకేరాజ్యము వచ్చి నేనేరాజునైనచో యీ

నామిత్రునకు ప్రధానమంత్రిత్వమిచ్చెదఁగాక. (నవ్వుచు) నేను రాజును. నామిత్రుఁడు మంత్రి. హా! హా! హా!

త్రాగు—(చిపాలునఁబ్రవేశించి) నిజమేనా?

విక్రి—అంతటి యోగ్యతయే పట్టిన నిన్నుమఱతునా?

త్రాగు—ఒకవేళ నీవురాజగుదువనుకొమ్ము నేను మంత్రినైతే సర్వాధికారము నాకిచ్చెదవా?

విక్రి—ఇచ్చినచో?

త్రాగు—ఇచ్చినచో అని యడుగుచున్నావా యింకా! విను.

సీ. కల్లుసారాకొట్లఁ । వల్ల వీధులునింపి
ప్రతివాడు త్రాగగా । వలెనటంచు
వారకాంతలఁదెచ్చి । వాడవాడలనింపి
ప్రతివాఁడుభోగిగా । వలెనటంచు
కనపడ్డస్త్రీనెల్ల । గట్టితెచ్చియుమన
పదములకడనిల్ప । వలెనటంచు
నిజముమాటాడెడు । నీచులబల్మిమై
బంధించిహింసింప । వలెనటంచు

గీ. వలయుశాసనములఁదెగ । వ్రాసిమనకు
వలయుద్రవ్యంబునార్జించు । వాడఁగాని
వారివీరికి వలెచేత । వాతగాక
గూరుచుండుము నే గిల్లు । కొనుచుగోళ్ళు.

(అంతయిర్వురు చోరులు ప్రవేశము)

మొదాం—అరేచినోడా! యీాళ్ళిద్దరెవళ్ళో యిక్కడున్నారా! వీళ్లని మనసావాసగాళ్ళుగా తీసుకొన్నామా మనయువారానికేమీ అబ్బెంతరంలేదుగా.

రెం దొం—మాదొడ్డఆలోసనరా సీది. ఒరేయి పెద్దోడా! రాత్రి కన్నాసికియాళ్ళుకూడా మన్తో వచ్చుంటే ఆపెట్టెలుగూడా వచ్చేయేరా?

మొ చో—సిన్నోడా! యాళ్లెవళ్లోపలు కాడిసూదారి! ఓరా) మీరు!

విక్రీ— మేమా? ఇక్కడ తపస్సు చేసుకుంటూవున్నాము

మొ. చో—తపచ్చాడుకోడానికి యీకల్లుముంత లెందుకయ్యా!

విక్రీ—అదంతయు మీ కెందుకు లెమ్ము ముట్టుకోకండి.

మొ. చో—ముట్టుకోకలూ అంటుకోకలూ మాకేమీ తెల్దు. మేమెవరో మీకు దెల్చునా? మాపేరంటే యీబూలో కాన్కా గడగడాట్. అంటే తెల్సిందా? గజదొంగలన్న మాట. అయితే మునీచ్చర్లుగదా గడ్డాలేయి మీచాలేయి చూత్తేమాకుమల్లేనే దొంగచన్నాచుల్లాగున్నారే! నిజమాడ్తా రాచరే, లేకపోతేసిన్నోడా! సూత్తావేందిరా? తెక్కలిరగ మొడవేమిరా?

విక్రీ—మమ్ములను గొట్టిన మీకేమిలాభము రాగలదు? మీయిచ్చ వచ్చినరీతి వాసురయంతయు పుచ్చుకొని పొండు

మొ చో—అంటుకోకంటివే ? చిన్నోడా సూత్తావేందిరా ఎట్టిచన్నాచి! వేస్కుందాంరారా! (ఇరువురునుత్రాగుదురు)

త్రాగు—అంతయు మీరేనా?

మొ. చో—ఇదిగో ఏడవండి. (అందఱును త్రాగుదురు)

మొ చో—ఎట్టివెదవల్లారా!యినండి! మేమిద్దఱం మీరిద్దరుగదా మీయవారాలన్నీ మాకూ తెల్చునులే.తపచ్చలూ దొంగజపాలుయియ్యాన్ని యెందుగ్గానీ కన్నాలేదారి. లాబాలు పంచుకుందారి చరేనా? మాంతోవత్తానంటారా?

త్రాగు—(తనలో) దీ, వహ్వా! మంచి ఆలోచనే. ఈ ముండాకొడుకును ఎట్లయిననేమి త్రాగుడులో దింపినాను. చల్లఁగా నిందులోనికిఁ గూడ దించినచో నింతబ్రతుకు దెరువుగా నుండును (ప్రకాశముగా) ఈ సురాపానములో వున్న మహత్తింకొకటి చెప్పడం మరచిపోయినాను మిత్రవరా! విను.

గీ. కులముచూడంగఁ బనిలేదు । కొంటెవారు
మంచివారన్నభేదంబు । నెంచనీదు
అన్నదమ్ములమనుభావ । మంకురింపఁ
జేసి మనకైకమత్యమి । చ్చెడినికల్లు.

అన్నాఁడొకాయన. ఒప్పుకుంటావా?

విక్ర—ఒప్పుకొన్నాను

త్రాగు—అందుకనే ఒక సంగతి చెప్పెదను. విను.

గీ. జోగులము నీవు నేనును । చూడ నెక్క
కాసులేదర చేతను । గాన వీరు
సోదరులు వీరితో నున్న । చో మనలకు
బ్రదుకు దెఱువుగ నుండు పో । వుదము రమ్ము.

విక్ర—నీవు గంగలోనురకమన్ననూ ఉఱికెదను

(అంతయిరువురు రాజభటులు ప్రవేశము)

1 బం—అరే! పద్మాషుల్ యీడా వుండార్ సూడు బే. పకడో పకడో రే నిన్న రేత్రి ఖాడా ఖన్నం చేసి ధౌడాయించార్ రే

మొ. దొ—యీళ్ళే యీళ్ళే మారాజా! మాకు ఏమి తెల్దు!

విక్ర—అయ్యా! మేము దొంగలము కాము.

బం—మీర్నల్వ్యార్ దొంగల్ వుండార్ నూకన్నుల్ వాడ్కి ఖులాయించి సూసేటాల్కి మీకీ ధౌడాయిస్తుండార్ లేదు బే

విక్రి—ఇది వట్టి అన్యాయముగాదా?

బం—అరే అన్నాయంమాదిగాదురా వెధ్వా! అల్లాకీసునోరే! తుమ్కు ఫకడ్నేకు సర్కార్ హుకుందియారే! అక్థ నీబాబు వుండార్ సెహో.

విక్రి—నాతలదిమ్మ చప్పంగా వదిలినది.

గీ. ఎటులసంప్రాప్తమయ్యె నా । కీ దురాత్ముఁ
డార యేటికిఁ జిక్కితి । వ్యసనమందు
కారణార్థంబదిట్లుగా । గడువనుండ
నేడనున్నను శక్యమే । నేఁదరింప?

(ప్రకాశముగాఁ ద్రాగుఁబోతుతో) నాకునీవెటులదాపరించితివి?

గీ. సుఖముగానిటముక్కుమూ । సుక రమేశుఁ
గొల్చుచుండగ నాకుఁ ద్రా । గుటలునేర్పి
వీరితోఁబాటుఁ గన్నాల । వేసికొనుచు
జీవనమొనర్పుమని యింత । చేసినావు.

త్రాగు—మిత్రమా! నన్నారకొసిరా? అందఱము ఒక్కచోటనే యుందము నన్నువిడచిపెట్టి నేనొంటరిగనుండఁ బోవుచున్నావా సమానదశ వచ్చినప్పుడు నీకింతవిచారమెందులకు?

గీ. కలదుమనకట స్నేహవ । ర్గంబు తగిన
వసతులున్నవి మన కుప । వాసబాధ
లేదచటభీతిలేనక । మీద వీర
లందఱును తోడుగానుందు । రందు రమ్ము.

బం—అరే! పకడోరే అంటే గుడ్డల్ హుక్మ్ సూస్తావురేబే. ఈడు బద్మాష్ వుండాడ్. (అందరిని పట్టుకొని తీసికొని వెళ్ళుదురు)



శ్రీ

# శారదా విజయము.

## తృతీయాంకము.

ప్రవేశము శారద:—రంగము—చీఁకటిగది.

దైవమా! నాగతి యెంతకుఁ దెచ్చితివి?

గీ. తల్లిచచ్చినఁ దండ్రి కాంతారవాస
ములకుఁబోయిన రాజ్య మొరులు గొనినను
అన్నతోఁగూడి సుఖముగా నున్నదాని
యీగతిని వేఱుఁ జేసితే నేమనందు

ఈతుచ్ఛుఁడు నాపాలిట నెటుదాపురించెను? నీతండ్రి నిన్నుఁ జూడ భ్రాంతిఁజెంది తీసికొనిరమ్మనెనని చెప్పి మోసగించి తెచ్చి యీయింటఁ బడవైచి అయ్యో! కామబాధకిలోనై యింతటి అన్యాయమునకుఁ బాల్పడియెనే? ఈమాయా వ్యూహంబిటుల పన్నునని యెఱుంగక మోసపోతినే? అయ్యో! నాకిచట దిక్కెవరు! శరణాగతవత్సలబిరుదాంకితుఁడవైన యోశ్రీకృష్ణా! ద్రౌపదీమానసంరక్షకుండవగునీవు ఆర్తావనదీక్షాపరతంత్రుఁడని విఖ్యాతిగడించి యీదిక్కులేని పక్షి యిక్కరణని బొక్కుచుండ మ్రొక్కులంగొని దిక్కయి బన్నంబునుండి తొలంగించుట

నీకొక్క ఘోరకార్యమే— (అన్ననుద్దేశించి) అన్నా! మాధవా! నే నే కాకినై యెటనుంటినో యని యెంత వెదకుచుంటివో! కాన్పించనైతివని యెంతతల్లడిల్లుచుంటివో! దిక్కులేనివాఁడనైతివని యెట్టిఘోరకార్యమునకు పక్రమించితివో! ఏమనితలంతును! ఎంతనివిలపింతును! నాయీవార్త నీకుఁ దెలుపువారెవ్వరు? నీయునికి నాకెఱిఁగించువారెవ్వరు? ఓ శశిదివాకరులారా! ఓతారలారా! ఓ మేఘములారా! ఆకాశసంచారులు గదా! ప్రపంచమంతయుఁ దిలకించుచుందురుగదా! నాయీదీనావస్థను విలోకించి నామొరాలకించి యీకౄరులవిపరీతచేష్టలుఁ దిలకించి నాసహోదరునితో వచియించరాదా? నేనున్నయిత్తావును వానికిఁ గనఁ జేయరాదా? అయ్యో! ఎవ్వరును నాకూయి నాలింపరైరే ఓ సూర్యచంద్రనక్షత్రమేఘంబులారా!

గీ ఎట్టిపాపంబు జేసితి ని నేను తొల్లి
ఎవరికెడబాటు జేసితి ని నిప్పుడిట్టి
దుర్గతులపాలుఁ జేసి నా ని తోడ నెవరు
మాటలాడరు నాగతి ని మాటయేమి?

ఉ॥ చీఁకటికొట్టునందు ననుఁ ని జేర్చియె పేనిమనంబుద్రిప్పిన
న్నాకపటాత్ముతోడఁగలి ని యంగను జేయగఁజూచుచుండమీ
రీకుటిలప్రయత్నముల ని కెంతయుమానముదాల్చియుందుర
య్యో! కలుమంబటంచు మది ని నూహ యొనర్చ రిదేమిపాపమో

గీ. ఆర్యమతసాంప్రదాయము ని లంతరింపఁ
జేతురా! ధర్మమడుగంటఁ ని జేతురా య
ఘంబువృద్ధిఁగఁ జేతురా ని ఖలులతోడి
జగమునిలఁ బెట్టఁజూతురా ని సర్వసాక్షి
హారికిజంకరెమీాకున్యా ని యంబులేదె?

ఆహా! ప్రపంచధర్మమెంతటివిపరీతదశయందున్న యది

సీ. సూనృతంబునశించె ౹ శుంతలుహెచ్చెరి
కల్లంగడులువి స్త ౹ రిల్లుచుండె
కులసతీమణులయు ౹ ద్ఘోషలుమితిమీఱె
ప్రబలెనధర్మంపు ౹ వర్తనంబు
ఆత్మలాభపరాయ ౹ణాభిలాషుఖమీఱె
దానధర్మంబులు ౹ దగ్ధమయ్యె
పాంథులబల్మిని ౹ బట్టిదోచెడువృత్తి
చోరులకుఁ సదా ౹ చారమయ్యె
కూడవని నోరుబెట్టుక ౹ గోలపెట్టు
వారికాబండబూతులా ౹ ధారమయ్యె
క్రమముగా నిప్డు ప్రబల జ ౹ గత్తునకిక
ప్రళయమబ్బకవర్ధిల్లు ౹ పథముగలదె.

పోనిమ్ము! ఏదోయొకవిధంబుగ నాయవస్థను సమర్థించుకొని యుందుమని దాదాపు రెండువత్సరంబులనుండియు యీదురాచారసంపన్నుని గృహంబున జాకిరికత్తెనై యల్లాడుచుండ యీదుశ్శీలున కిట్టివిపరీతబుద్ధి పుట్టనేల? పుట్టెంబో యిదినీకుఁ దగవుఁ గాదని యొంతప్రార్థించిన వినక వృద్ధవేశ్యాంగన నొకదానిని నాకంటఁగట్టి కుర్నీతులఁ బ్రబోధింపఁ జేయనేల? చేసెనుబో! దానికిఁగూడ హితముపదేశించితినే! వినకుండెనుబో! యుక్తాయుక్తవిచారణశూన్యరాలై నన్నీగతిహింసఁబెట్టుటతగవునా? సుక్షత్రియవంశంబున నంతటి మహారాజునకుఁ గూతునై జన్మించి చిట్టచివఱకు

ఉ. నీతియొకింతలేక నతి ౹ నీచతఘుంబగువృత్తిలో నప
ఖ్యాతిగసంచరించినదు ౹ రాగతురాలికిఁజిక్కినాను యీ

జాతికిఁజాలి ప్రేమయను సంగతిశూన్యమటంచెఱింగినీ
వీతఱి నూరకున్న నిఁక నెవ్వరుదిక్కగునాకు మాధవా!

(అంతటవృద్ధవేశ్యప్రవేశించి)

ఏమే! ఇప్పుడయినా నీబుద్ధి మరలినదా లేదా?

శార—ఇప్పుడుగాదు గదా, నీవువేయిసంవత్సరములు తలక్రిందుగ తపమాచరించినను లొంగుదాననుగానసుకొమ్ము—

వృ—అంతేనా?

శార—ముమ్మాటికిని—

వృ—బాగుగానాలోచించుకొమ్ము— చెడిపోయెదవు.

శార—ఇంతకన్న నేఁ జెడునదేమున్నది?

గీ. బంధుకులుగలరనునాశ వదలిపోయె
తల్లిమృతిజెందె తండ్రియూ తపసియయ్యె
అన్నదూరస్థుఁడయ్యె నే నున్ననేమి
మన్నయిననేమి దిక్కులే కున్నదాన.

వృ—నీకు దిక్కులేకపోవుటయేమి?

ఉ. చచ్చినవారువత్తురను సంగతివట్టి దిగాన వానితో
ముచ్చటగాఁజరించిసుఖ మ్ముఁ వడిగాంచుము వానిసంపదల్
హెచ్చు దరిద్రమాస్థితివ హించిదురంతపుకష్టమందగా
నిచ్చవహింతువేల? విను మీహిత మోసి పిశాచమా యికన్

శార—అమ్మా! రవంతయేనిచలింపనినాహృదయంబును నేల మరలింపఁజూతువు? మోసకారివై నీతండ్రి నినుఁజూడఁగోరి తీసికొనిరమ్మని నన్ను బంపెనని చెప్పి నమ్మించి యీపురంబునకుఁదెచ్చి తనయింటఁ జాకిరికత్తెగనుంచుకొని యీగతిని కామవ్యధకు లోనగుటఁ దగవా? చూడు—

గీ. క్షత్రియకులంబునకుఁగళం కంబుబెట్టి
పరసతీమణులనుబల్మి బట్టిచెఱుపఁ
గోరువాఁడౌనా? గలరె యీ తీరుచేయు
పాతకులు రాచకొలమందు నీతిలేక

వృద్ధ—ఓసీ చెకలీ! నయంబున నెన్నిబోధించినను వినని నీవంటిమూర్ఖు రాలి కిట్టి శిక్షయే ఫలితము సిరిరా మోకాలడ్డు మూర్ఖులుందు రా! త్రాగ లేనిపిల్లి బోరగిలఁద్రోసికొన్నటులగానున్నది నీచంద మంతయు; నీకీశిక్షచాలదు. నిన్నేమిచేసెదనోచూడుము.

శార—అమ్మా! ఏమిచేసెదవు?

గీ. కొట్టెదవు దిట్టెదవు బల్మి గట్టి వాత
పెట్టెదవు అంతమాత్రాన విబుధలోక
మునకుమచ్చనుగల్పింప మూర్ఖురాల
నగుచు లొంగుదునే యట్టి యధమునకుఁ.

(అంతఁగ్రూరవర్మప్రవేశించి)

ఏమే! వదరుచున్నావు? అధమునకులొంగుదునా, అనియా! లొంగవా? లొంగవా! మదీయ బాహుబలశౌర్యంబుల నెఱుంగక నింతగారేగుచుం టివి. నిన్నులొంగఁదీయుట నాకొకలెక్కయా? వినుము!

గీ. పోని యేటికి నేనాఁటి కేని నీకు
మారదా డెందమని పూన్కి మాని యింత
దనుక నూరటజెందిన దానికీవు
క్రోధమెక్కించుచున్నావు కుటిలురాల.

గీ. పెట్టరానట్టిబాధలఁ బెట్టి గట్టి
పట్టుబట్టి మనోరథం బెట్టులేని

దీర్చికొనకున్న నాదగు । తెలివి తేట
లేల? నాదు పతివ్రతావనిం । కేలఁ జూడు.

గీ. అన్ని విధములఁదగియుంటి । వనుచు నెంచి
దుర్భరంబగు దుస్థితి । తోడనుంటి
వంచుఁదలపోసి యెటులేని । మంచిదశకుఁ
దెత్తుమని జాలివహియించి । మెత్తదనము
జూపనిర్లక్ష్యమాయెంత । పాపురాల.

గీ. దిక్కులేనట్టి దానవీ । విక్కడ నెవఁ
డడ్డముగవచ్చు నా పతి । పాతిశయము
జూపుచుండఁగఁ గాన నో । పాపి! యేల
నంతదూరము దాక హృ । దంతరమును
మార్చుకొని యింకనేని నా । మాట వినుము 13

కమాచు—రూపకం

శార హా! హా! ఎంతమోసమాయెను-హరిహరి నేనేమి సేతు।
మోహితుఁడై వచ్చెడు నీ-మూర్ఖు నెటుల గెడపెదవో ॥హా॥
శార దుర్గం చెదనంచును నను బెద-రించుచుఁగారులు పేలుచు।
వంచనగతిఁ జూడసాగె-పాలింపఁగ రాఁగదయ్య ॥హా॥
కూర నారీమణి మొండితనము-నాకడనాసాగుటయే।
తీరునదైవమునను శా-ధించు నొకనుగొనెదఁగాక
శార పరవసతలసాంగత్యము-వాంఛించుట పాతకమని।
భావమునదలంచలేక-పాల్పడితి వెయపకృతికిటు॥
కూర పాపమో పుణ్యమోసినను-బల్వంతపరచియైనహృదయ ॥
తాపముఁదీర్చుకొనెద నీ-తాత యెవడడ్డము వచ్చునో॥
శార—అయ్యో! నాకీకష్టములు కష్టములుగావు నేనుత్తమకులకన్యకను
అవివాహితను; మోసంబునఁ దెచ్చితివి. నన్నీలాగున నిర్బంధిం

చుట నీకు ధర్మముగాదు. పరసతులపై మాతృభావము జూపవలయునని మనయార్యధర్మంబు లుద్ఘోషించుచున్నవి. అట్టి ధర్మవిరుద్ధకార్యంబు లాచరించి యిహపరంబుల కేలఁ జెడియెదవు? నీవా, వివాహితుఁడవు. సిరిసంపదలుగలవాఁడవు. నీసతీమణిని పరు లిటులనే బాధించినచో నీ కెంతనొప్పిగనుండును! ప్రపంచంబున మానవులమై జన్మించినందులకు సత్క్రియాచరణులమై యశశ్చంద్రికలు నలుదిక్కుల విడంబించులాగున జూడవలయునుగాని,

గీ. త్రాగుఁబోతుదనంబు జూ । దమును పరస
తీమణుల సంగ్రహించుట । తీవ్రకోప
మునఁ బరులహింసఁ బెట్టుట । యనుబొనర్చి
క్రూరుఁడనులోకనిందలఁ । గోరఁదగునె 14

అట్టి పాపకర్మల దండింపఁబైన దండధరుండుగలండని భయంబందవలదా? భగవంతునకు వెరువవలదా? మఱియు;

గీ. నీపయిని ప్రేమమూ లేదు । నిన్నుగూడి
సుఖములందఁగ మదికిఁదోఁ । చుటయు లేదు
అట్టి యనురాగమే లేని । యట్టిదాని
నెందులకు బాధపెట్టెద । వీవు చెపుమ. 15

అంతియేకాక నన్నాయని బిలుచుదానిపై భ్రాంతిజెందుట యుక్తముగాదు. లోకమున నెవ్వరేని తమసోదరీమణులపై మరులుగొనినవారు గలరా? అట్టిదురాశావేశులగతి యేమైనదో మనకెందఱి చారిత్రములు ప్రామాణికములై కన్పట్టుచున్నవి! కాన,

చ. కులము సముద్ధరించుకొను । కోర్కెయొగల్గిన సాటివారిలోఁ
పలఁ దలయెత్తుకఁ దిరుగు । వాంఛయొగల్గినఁ గీర్తిచంద్రికల్
నిలుపుకొనంగ నెంచిన మ । నీషులమెప్పులనందఁగోరినన్
దలఁపకు మిట్టి దుష్క్రియలఁ దాల్పుము నీతి,వివేకమున్ మదిన్

కూౢర— నీపాటిహితబులు నాకుఁ దెలియకఁ గాదు! నీవు కన్యకామణి వనియే నిన్నుఁ గామించితి. పురుషులకు బహుభార్యలను బడయుట నూతనముగాదు. నేను పరిథముఁడనుగాను. నీమూర్ఖతను గాంచియే నీకిట్టిశిక్ష విధింపవలసివచ్చినది. నీవు క్షత్రియకాంతవైనను నీపట్టుదలను మాన్పించవలెననియే నన్నుఁ జేఁబట్టునట్టులొనర్పవలయుననియే.

గీ. వేశ్యకటులొప్పగించి నీ విధము మూరు
యత్నములొనర్చుమని చెప్పి యటులవినక
పోదువేనియుఁ దగినట్లు బుద్ధిజెప్పి
కోర్కెదీర్చుమటంచును గోరనయ్యె.

శార— ధర్మవ్యతిరిక్తకార్య మొనర్చుటకు నామానసం బంగీకరించనప్పుడు నీవెవ్వరికొప్పగించిననేమి? ఎట్టికఠినదండనల విధించిననేమి? అంతమాత్రంబుననే మానసంబు భరించు నను కొంటివా!

గీ. క్షత్రియకులాంగనను అందు కన్యకామ
ణిని యభంబుశుభంబెఱుఁ గనిపవిత్రు
రాల నన్నిట్లు వేఁడఁగా రాదటన్న
వినవు నీమానసముమార్చు కొనవదేమి?

గీ. దీననై యొంటిగా నిట దిక్కులేక
యున్నదాన నటంచు నే నెన్నిగతులఁ
దిప్పలను బెట్టిననుగాని ముప్పులేదు
పైన దైవంబు లేడె గా పాడరాడె.

గీ. పాపచరితులు బొనరించు పనులవెంత
కాలమో నిల్వనేర వి కలియుగమున

పాపమేనాటి కేనియు । బిద్దలగుచు
ధర్మమేనిల్పు వాచంద్రి । తారకముగల!

కూ్రిర—ఓసీ! వేశ్యమాతా! దీని యాగడము మతీంత హెచ్చైనది. దీనికిఁదగు పా్రియశ్చిత్తమొనర్చి మన్మనోరథమీడేర్చుకొను తెరువాలోచింతము. నావెంటరమ్ము (శారదతో) ఓమూర్ఖురాలా! నీకు వినాశకాల మాసన్నమగుటఁ బట్టియే మామాటలు నిచెవులదూరకున్నయవి నీకర్మంబున కెవ్వరేమిచేయఁగలరు? అనుభవింపుము. నీయంతటనీవు పశ్చాత్తప్తురాలవై క్షమాపణ వేడుకొను నంతదనుక నీకిదియేశిక్ష. (వెడలును. వేశ్యమాతకూడ వెంటఁబోవును.)

శార— (స్వగతము) ఈదురాత్ము లెంత బాధించినను కలుషంబగు వారి పథంబుదొ్రిక్కుమనని యే వారియభిపా్రియముగాఁబోలు. ఓదయామయా! పరాత్పరా! సకలంబునకును నీవే సాక్షీభూతుండవుగదా, నావిషయంబునఁ బాపపుణ్యవిమర్శనం బొనర్చి న్యాయంబుఁ బ్రసాదింపనశక్తుండవా?

మోహన—ఏకతాళం

ఈశ్వర నీదయ కెదురుచూచుచునుంటి ఏలాగాగుచేసినన్।
జననీజనకునీసోదరునీగోలుపోయి వనటలొందుచునిట్టు ॥ఈ॥
కూ్రిరుఁడుజంకూగొంకును లేకనన్ననయీ వంచన పాలైతి నీ
తీరుః బాధింప దిక్కేదినీకన్న ॥నీ॥

సీ. అలనాఁడు రచ్చలో । పలవార్తయైవిల
పించుదా్రిపదిని ర । క్షించినావు

పలువిధబాధల । పడుచువాఁడు వేఁడిన
ప్రహ్లాదునట్లు గాఁ । పాడినావు
కరిమకరికిఁ జిక్కి । గాసిలి ప్రార్థింప
మరువుగాఁ బరువెత్తి । ప్రోచినావు
దనుజులఁ బరిమార్చి । మునిసంఘమును బ్రోచి
మించి కీర్తిఁ గ । డించినావు

గీ. అనదనై యున్నవాఁడ కు । య్యాలకించి
క్రించుదనమును మాని ర । క్షించకున్న
సున్నయే నీదు బిరుదంబు । లన్ని నీవ
చేసిన ఘనంబులు హుళక్కి । వాసుదేవ.



కాన రమ్ము. ఆదరంబున నా మొఱాలించి రక్షింపుము. ఈనీచకులజారాలు పెట్టుచున్న బాధలకుఁ దాళలేక నిద్రాహారంబులకు మోము వాచి యహర్నిశలును నీవే శరణ్యమని వేఁడుకొనుచున్న నన్నుద్ధరింపుము.

(అంతఁ గీర్తివర్మ ప్రవేశించును.)

ఎక్కడిదీయార్తధ్వని! కంఠస్వరమును బట్టి చూడ నాఁడుది యెవ్వరో ఆర్తయై పలపించుచున్నట్టు లున్నయది. (అటునిటుఁ జూచి) ఓకాంతాశిరోరత్నమా!

గీ. ఏది నీయూరు నీనామ । మేది పతి యె
వండు చీఁకటికొట్టునం । దుండి యిటుల
బొగులఁ గతమేమి నీమది । దిగులు విడి
పలుకు దేని సహాయంబు । నలుపువాఁడ.

శార — ఆర్యా! తా మెవ్వరో మహాపురుషునివలెఁ దోఁచుచున్నారు మీ రెవ్వరైననేమి గాని నావృత్తాంతంబు వినుఁడు. పిమ్మట మీకుఁ దోఁచిన సహాయంబొనర్పుఁడు!

గీ. తండ్రి విక్రమవర్మ నా తల్లి సత్య
వతి నివాసము శాహు బలపురంబు
తల్లిమృతిఁ జెందెనాదగు తండ్రి కాన
నంబునఁ దపస్సుచేయుచు న్నాఁడు దేవ !

గీ. రాజ్యము హరించెఁబరులు, బై రాగులమయి
బిచ్చమెత్తుచుఁ గాలంబు బుచ్చుచును స
హోదరుఁడు నేనునున్ గూడి యుండఁ గ్రూర
వర్మయేతెంచె మాదు ని వాసమునకు.

గీ. వచ్చి మాయన్న లేనట్టి వార్త నెఱిఁగి
చూడఁగాఁగోరి తండ్రి నా తోడ వెంటఁ
బెట్టుకొని రమ్మనెనటంచు నెట్టు బెట్టు
కొనివచించుచు నను తోడు కొనుచువచ్చె.

ఎంతదూరముఁ డచినను నాతండ్రిజాడయే గానరాదయ్యె. ఈపురంబున కెట్టులెట్టులోఁ జేర్చి నీతండ్రి గాన్పించలే దేమిచేయుదునని వచించి తనయింటఁ జాకిరికత్తియగా నుంచెను. ఇట్టులుండనుండ నొక్కనాఁడీ క్రూరవర్మ దన్ను జేపట్టుమని నిర్బంధింప నేనొల్లమి నన్నొక్కవేశ్యమాతవశంబొనర్చి సామదానభేదదండోపాయంబుల నన్నులోబఱచుమని చెప్పినంత నావృద్ధవేశ్యాంగన యెన్నియో దుర్భోధనల నొనర్చి పలుతెఱంగులహింసించెను. క్షత్రియవంశంబున జన్మించినదాననగుట బూతులజాతియగు నీవేశ్యలయింట భుజించుటకు మనంబొప్పమియు నాకుఁ గల్గిన మహాపదలొక్కటొక్కటిగఁ దలంపునకువచ్చి మర్భనిర్భేద్యమగు విచారముప్పొంగ నానిద్దుర నశించుటయు నారమామనోహరుని తలంచుకొనుచు నాకొఱకు నేను గానరామి యడలుచున్న నాసహోదరుని గూర్చి తల్లడిల్లుచు కష్టపరంపరలపాలై యీరీతి

బొక్కుచుండ జాలిమాని, నీతి విడచి, కరుణలేక, ధర్మవిమూఢులై, పాపభీతిని విడచి యిత్తెఱంగున చీకటికొట్టునం బడవైచి తాళము వైచి పోయిరి. ఈవిధముగా నేనిట్లు కృశించి కృశించి ప్రాణముం బాయుద మనుకొన్నను;

గీ. అనుదినంబును వచ్చి వ । న్ననఁగరాని
భావణములాడి, విపరీత । భయముపెట్టి
పాడిచెదము చంపెదమటంచు । మూర్ఖులు పొన
రించు చెయ్దము లేమి వ । చించుదాన.

కీర్తి—ఆహా! ఎంతటి యాపద సంభవించినది! (తలయూచి) సరే. కానిమ్ము. ఓమానవతీలలామా!

గీ. స్వకులధర్మంబులను బూది । పాలొనర్చి
కాంతలను జెఱుపఁబూనుదు । రంతకులెవ
రేని వరిల్లరే ధాత్రి । లోనఁ గాన
భీతివిడనాడి నీవు నా । వెంటరమ్ము.

ఇదె తలుపును బ్రద్దలుచేయుచుంటిని (తలుపువిఱుగదన్నును)

శార—(ఈవలకువచ్చి) మహాత్మా! ఈయాపదనుండి తొలంగించిన మీకు నేనేమిప్రత్యుపకార మొనర్పఁగలను?

కీర్తి—సతీమణీ!

గీ. ధరఁ బరోపకారార్థ మి । దంశరీర
మనెడునార్యోక్తిఁగాపాడు । కొనెడివాఁడు
ప్రత్యుపకృతి బొందగ । వలెనటంచు
వాంఛతోఁబరులకు సాయ । పడునె చెపుమ.

అదియుఁగాక నేనొనర్చినది యేమంతమహాద్భుతకార్యమని ప్రత్యుపకారమును బొందెదను? చూడు,

గీ. దీనసంరక్షణంబును దేశరక్ష
ణంబు కులధర్మసంరక్షణంబు క్షత్రి
యాన్వయమునకు ముఖ్యకార్యంబులగుట
నిలుపుకొంటిని కులధర్మములఁ బడంతి.

నాయొనర్పవలసిన ధర్మంబింకను బూర్తియే కాలేదుగదా!

శార—మహానుభావా? ఇంకేమికలదు? కారాగారవిముక్తురాలినిగా నొనర్చితిరిగదా!

కీర్తి—భామాశిరోరత్నమా! ఉన్నదంతయు ముందే గలదు:— వినుము.

గీ. స్వకులకాంతగదా యన్న జాలిలేక
పాపకృత్యంబుగద యన్న భయము లేక
శిష్టులేమందురో యన్న సిగ్గులేక
చెనటి యైనట్టివాని మన్నింపఁదగునె?

గీ. ఇట్టి దుష్టుని విడనాడు దేని యింక
నిట్టికృత్యంబు లెన్ని చేయించువాఁడొ
ధగధగల్గొల్పు నాదు శస్త్రమున వాని
మస్తకంబును గూల్పక మానఁగలనె.

గీ. గర్భనిర్భేదకంబగుఁ గాదె యిట్టి
క్రూరకృత్యంబులఁదలంచు కొన్నయపుడు
యిపుడు నాదేహముఁ గ్రోధ మినుమడించి
కొందరించుచునున్నది క్షత్రింప వాని.

కాననో యబలా! యిటువినుము.

గీ. ఏను క్షత్రియకులజుఁడ నేనిశౌర్య
వంతుఁడన యేనిధర్మప్రవర్తకుండ

నేని రేపటిలోపల ǁ వాని ద్రుంచి
ధర్మమును నిల్పుకొందు కాం ǁ తాలలామ

అప్పటికి నావిధకృత్యము నెరవేరినట్లు—

శార—ఆర్యా! ఈకాంతకై తామేల యింతటిశ్రద్ధవహించి కష్టపడవలయును! అద్దురితాత్మునితోఁ బగ యేలఁ బూనవలయును.

కీర్తి—వింతమాటంటివి. ఆదురాత్మునిపగ యేలయనియా?

గీ. కత్తి నిటుచేతఁబట్టి యు ǁ న్మత్తులగుచు
పాపకృత్యంబులొనరించు ǁ వారితలల
నెగురవేయక విడిచెద ǁ నేనినాదు
క్షాత్రమేటికి నాజన్మ ǁ సఫలమేది.

ఓ కాంతా!—మనమింకను మాటాడవలసిన సంగతులున్నచో నావలఁ జూచుకొనవచ్చును. ముందిటనుండిపోవుట యుక్తము. బయలుదేరుము.

శార—చిత్తము. (తనలో) ఇమ్మహానుభావుని జూచినప్పటినుండియు, నాహృదయంబునఁ బ్రేమబీజమంకురించుచున్నది. ఈపుణ్యుడు నాకొనర్చినయమూల్యోపకారమునకుబ్రత్యుపకృతిగ నాఁ శరీరమును గానుకగా సమర్పించి ధన్యురాలనౌదునుగాక!

(ఇరువురునునిష్క్రమించుచున్నారు)





శ్రీ

# శారదావిజయము.

## చతుర్థాంకము.

ప్రవేశము:—మాధవవర్మ:—

ఆహా! క్రూరాత్మురాలు మేనయత్త యెంతకట్టడి కార్యమునకుఁ బూనుకొన్నయది.

గీ. బంధుగుణటంచుఁ దలపక పాపభీతి
వదలి కాఠిన్యమును బూని వదలుఁడీతని
నట్టనడిసంద్రమందని నావికులకుఁ
జెప్పఁబంపించె భటులకు నొప్పగించి.

ఆయుర్దాయమున్నంతదనుక నెవ్వారెన్నికష్టంబులఁ బెట్టినను ప్రాణములు పోవుగదా! ఆమెకు నాయందింత యసూయ జనించుటకు నేనొనర్చిన పాతక కార్యమేమియును లేదే? విద్యాబుద్ధులుగల మటయందు నేను ముందంజ వేయుచుంటి నని గాదా, ఆమెకు నా పై క్రోధము! దానికి నేనా ఉత్తరవాదిని?

మ. తనపుత్రుండవివేకి యేటఁగత విద్యాబుద్ధులం దారి తే
రనుసామర్థ్యుఁడుగాక పోయె నణుమాత్రిం జేసిహృత్ప్రీతినీ

సును సేబూని యెఱుంగనట్టివాఁడనీ ¦ తండ్రిప్రియుఁ బూనుపే
లనె వామామయె యున్న యింటికడ ¦ నీలాగుఁ బ్రవర్తించునే.

ఇందా మెదో సమావంతయును లేదు, ఊరక పిచ్చివాఁడనై వాపోయె దనుగాని.

గీ. ప్రేవుచుట్టమె మేనత్త ¦ ప్రేమ మామె
కెట్టులుండును నామీఁదఁ ¦ బెట్టు చుట్ట
మగుట యేమనుకొందునో ¦ యనుచు మామ
యేమనునోయంచుఁ దాల్మివ ¦ హించెనెటులో.

అవును. నేను జీవించియున్నచో నావిద్యాప్రావీణ్యంబునఁ దనకుమా రునిమించిపోవుదుననియు। కీర్తివంతుఁడనగుదు ననియు నీర్ష్య పుట్టినఁ బుట్టవచ్చును. కాని!

గీ. తనగృహంబుననుండ వ ¦ ద్దనివచించె
నేని యెమీఁదఁ బోయి ¦ యెటులో బ్రతుకు
దెలుపుజూ మక జీవింతు ¦ కరుణమాలి
ప్రాణములఁ దీయఁ బంప లా ¦ భంబ దేమి.

నాయీవార్తనిని నామేనమామ యెంత తల్లడిల్లుచున్నవాఁడో? గదా! ఆనాఁడు నన్నాయవస్థలోఁ జూచి యాదరించి, తనయింటికిఁ దోడ్తెచ్చిననాటనుండియు.

గీ. పరుష వాక్యమొక్కండేనిఁ ¦ బలికియెఱుఁగఁ
డెన్నఁడును కోపమును వహిం ¦ యించలేదు
కొఱఁతయెద్దానియందుఁ జే ¦ కూర్చలేదు
ప్రేమచుట్టముఁ జూపించు ¦ ప్రేమమిదియ.

గీ. ముక్కుచునుమూల్గుచును ॥ దమబొక్కసంబు
బోయెనంచును యేడ్తురు ॥ బుద్ధిలేక
ఎపుడుపోవుపిశాచ మం ॥ చెంతొకోర
చూపుచూపించెదరు పెట్టు ॥ చుట్టములిల.

ఎట్టులెట్టులో మా మేనయత్త ప్రియత్నంబులు భగ్నములై పోయినవిక దా! ఈపురంబుఁజేరితి. ఇచట బలుసాకేనియు నేఱుకొనితిని ప్రాణములఁగాపాడుకొన వచ్చును. ఈపురమహాత్మ్యమేమియో గాని చాలవిచిత్రముగఁ దోఁచుచున్నయది. (అటునిటుఁజూచి) ఎవ్వరోవచ్చుచున్నట్టులున్నయది. వీనితోడఁ బ్రసంగించి యీ పురవిశేషంబు లరయుదుఁగాక!

రాచభ—(ప్రవేశించి) ఈతండెవ్వరోగాని యొకరాకొమరునివలెఁగా న్పించుచున్నాఁడు. ఈపురంబున నెవ్వరు ప్రవేశించినను వారివృత్తాంతములుగూఢముగా విచారించుచుండుమని మా క్రొత్తరాజుగారియాజ్ఞ (ప్రకాశముగా) అయ్యా! మీది యేయూరు!

మాధ—ప్రస్తుతమిచ్చటనే.

రాచభ—ఇచటకు నూతనముగావచ్చినట్టులున్నయదే.

మాధ—అవును.

రాచభ—ఎచ్చటనుండి

మాధ—శ్రీరామనగరమునుండి

రాచభ—ఎందులకు?

మాధ—ఉదరపోషణార్థమై

రాచభ—అనఁగానుద్యోగముసంపాదించుకొనుటకన్నమాట.

మాధ—అవును కాని యిచటరాజెవరు? వారిప్రభుత్వమెట్టులున్నయది? నాకిటనేని యొకయుద్యోగము దొరకఁగలదా?

రాచభ—ఇచ్చటిరాజు క్రొత్తవాఁడు. శాసనములన్నియుఁ జాలకఠినము
లు. నీవంటివానికిఁ దగిన యుద్యోగము లిచ్చుటనున్నట్టు లేమి
యుఁదోఁచుట లేదు.

మాధ—క్రొత్తవాఁడా మీప్రభువు? వానినామధేయము.

రాచభ—విక్రమవర్మయఁట.

మాధ—(తనలో) విక్రమవర్మయనగా నాతండ్రియా యేమి చెపుమా?
నాతండ్రి యేమైనచో శాసనంబులతికఠినములుగ నుండనేల?

గీ. సద్గుణంబులప్రోవు విశాలహృదయుఁ
డార్తజనరక్షకుండు న్యాయప్రదీప
కుండు నాతండ్రిగద యిట్టు లుండినట్టి
కఠినుఁడెవ్వఁడో నాతండ్రి గాఁడు కాఁడు.

మాధ—నూతనప్రభువనఁగా నీయనకీరాజ్యపదవి లభించి యెంతకా
లమైనదో? ఎట్టులభించినదో సవిస్తరంబుగఁ దెలిపెదవా?

రాజభ—అయ్యా! అట్టిరహస్యంబులఁ దెలుపుట రాజశాసనంబులకు
విరుద్ధంబయ్యెను నీపై నాకుఁ గూడమిన ప్రేమచేఁ దెల్పెదను నా
కర్ణింపుము. విక్రమవర్మకు భార్యలేదు. కొండొకప్పుడు రా
జ్యమేలినవాఁడటఁగాని దైవవిధివలన నారాజ్యంబును గోల్పోయి
తనకుమారుని, కుమార్తెను నెచ్చటనో విడచి తపంబులకై యర
ణ్యములకరిగినంత నచ్చటొక త్రాగుఁబోతు సాయసంపత్తిలభిం
పఁ దానుగూడనట్టి దురభ్యాసంబునకులోనై తపోభగ్నుఁడై
కొండొకకారణంబున రాజదండనవిధింపఁబడి యేవోయొ
కగొప్పయుత్సవసందర్భమున నేరస్థులందరితోఁ గూడ విడుదల
కాఁబడియె. ఆకాలముననే మారాజుగారు మరణించినందున
మంత్రిసత్తముఁడొక యేనుఁగు తొండంబునకొక పూలహారము
నలంకరించి యాపూలహారమెవ్వరిమెడలో వేయునో వారికిరా

జ్యపదవినొసంగునటుల నియమమేర్పఱుప నాయేనుఁగా పూలహారము నీవిక్రమవర్మమెడలో వైచెనట. తత్కారణంబున వీనికీరాజ్యంబు లభించినది. ఎంతయో కాలముగాలేదు.

మాధ — ఓయీ! అట్టి నియమమేర్పఱచిన యమాత్యశేఖరుఁడున్న వాఁడా?

రాజభ — ఆతఁడుండిన పరిపాలన మిట్లేలయుండును? తనకు రాజ్యపదవి లభించినతోడనే యాయమాత్యుని వదలించి తనకు సురాపాన మలవాటుపఱచిన వానికిఁ బ్రధానమంత్రిత్వమిచ్చె. తత్కారణముచేత యీపురం బీగతినున్నయది. మూఁడుడు. మా రాజశాసనములు!

మ. సురఁ ద్రాగంగనెవండయేని మదినీ సుర్ జెందినన్ పెద్దలం
దఱుపూర్వంబదిదోసమంచనిన శాస్త్రంబుల్ ప్రబోధించినన్
పరనారీమణులెవ్వరైనను సరే బంధించితోడైచ్చి భూ
వరుసాన్నిధ్యముఁ జేర్పకుండినను జీవంబుండదెవ్వారికిన్.

మాధ — (లోనలో) ఈకూరశాసనములఁ గల్పించి జనాళిని పీల్చిపిప్పి చేయుచున్న వాఁడు నాతండ్రియేగదా! ఛీ! ఇట్టిఛండాలుని రాజ్యంబుననిఁక నిలువరాదు. అయ్యో! తండ్రియే! తండ్రియైన నేమి? మరి యెవ్వరైన నేమి?

గీ. మానమభిమానమునువీడి దానధర్మ
సంగతులనాశమొనరించి సత్యసియాతి
వదలి యీరీతి మందుఁడై బ్రిదురు వాసి
మొగముఁ జూచుటఁ బాతక మగునుగాదె.

గీ. భారతావని జనియించి ప్రామినుకుల!
ననుసరింపక దుష్టకృత్యములొనర్చు!

చెలులను బట్టవేగ శిక్షింపఁదగును:
గాని విడచిన కలుగదే హాని ప్రజకు.

ఇట్టి పరమపాతకచరిత్రుని చూడఁబోవుట యుక్తముగాదు. కావున నే క్రియనైనఁజూచి యిదినీకుఁ దగదని మందలించి నీతివంతునిగావింపఁబ్రయత్నింతును. వినకుండెనా!—చేయవలసినపని చేసి క్షత్రియకులంబునకు వన్నెఁదెచ్చి ధర్మంబుఁబ్రతిష్ఠించెదఁగాక. (ప్రకాశముగా) ఓయీ! మీరాజుగారిని సందర్శించి పోయెదను

**రాజభ**—ఆర్యా! ఆమహానుభావునితోఁ బ్రవర్తించునపుడు తగిన జాగ్రత్తగా నుండవలయునుజుమా!

**మాధ**—అట్లనే. రాజ సందర్శనంబున కిది సమయమేనా?

**రాజభ**—(ప్రొద్దువంకఁజూచి) ఆహా! ఇప్పుడు సమయముగనే యున్నది.

**మాధ**—అట్లయినచోఁ గాలాతితంబేల? నీవు నీపనిమీఁదఁబొమ్ము. నేనును పెందలకడ రాజ సందర్శనార్థమై పోయెద.

(ఇరువురునిష్క్రమింతురు)





శ్రీ

# శారదా విజయము.



## పంచమాంకము:—



పరివేశము:—(సారాయముపాత్రతో విక్రమవర్మ. మాధవవర్మ)

మాధ—తండ్రీ! మీరిట్లు నన్నుఁ బ్రేరేపించుట బొత్తుగాఁ దగనిపని సుమా!

విక్ర—దానిమహాత్మ్య మెఱుఁగ లేక యిట్లాడుచుంటివిగాని.

మాధ - దానిమహాత్మ్యప్రబోధము గూడ నెందులకులెండు. పరమపావనమగు సుక్షత్రియ వంశంబునఁబుట్టి భారతీయుల మనిపించుకొని తిరుగుచు నాత్మగౌరవమును విసర్జించి, మానాభిమానంబులఁ బరిత్యజించి, పలువురకు బుద్ధిఁజెప్పఁదగిన మనమేయిట్టి కట్టడికార్యంబులకు నడుముఁగట్టుకొని సిద్ధపడుచుండ నింకఁ దక్కుఁగలవారల గతియేమి? చూతుఁడు. పురంబంతయు నట్టులున్నదో!

సీ. ఏప్రక్కఁ జూచిన యేని సురాపాన
        చిత్తులై దుష్కృతుల్ జేయుచుండ్రి
ఏవంకఁ దిలకించె నేని వేశ్యాంగనల్
        సుజనులఁ జెఱుపంగఁ జూచుచుండ్రి

ఏదెస వీక్షించె ఽ నేని చోరులు పాంథ
కోటినిబల్మిని ఽ గొట్టుచుండ్రి
ఏ టెంకిఁగనుగొన్న ఽ యేనిమాంసపురాసు
లను బెట్టుకుని యమ్ము ఽ కొనుచునుండ్రి

గీ. యిట్టి విపరీతకార్యము ఽ లెట్టుజరుగు
చున్నవో చూచి యెటులోర్చు ఽ చున్నవారొ
ఆర్యధర్మంబు లెటుపూయ ఽ మయెనొతండ్రి
యింత ఘోరముజూచి స ఽ హించు టెట్లు.

విక్ర—అటుల రాజశాసనంబు లేర్పర్చఁబడినవి. రాజచట్ట విరుద్ధంబు గ ప్రవర్తించినవారు శిక్షార్హులగుదురు. కన్న పుత్రుండవగు టచేతఁ దెలియక నీవట్టులాడుట విని యూరకుండనయ్యెఁగాని పరులకట్లు పలుక వీలులేదు.

మాధ—అట్లనే యగుఁగాక! నన్ని కార్యమునకుఁ బురిఁగొల్ప నేల?

గీ. విబుధులిదిగూడదంచు వే ఽ విధులఁబల్కి
తగిన శాస్త్రంబులరచించి ఽ ధర్మము ప్ర
తిష్ఠ నొనరింప వాటిని ఽ ద్వేషబుద్ధి
జూచి యీరీతివర్తిల్లఁ ఽ జూడనేల?

ధర్మశాస్త్రవిచారణ మటుండనిండు.

గీ. నాకదిరుచింపదయ్యె యే ఽ నాడుగాని
దీనిజవిజూచియెఱుగ న ఽ ద్దాననేల
పట్టి బలవంతముగఁ ద్రాగ ఽ వలెనటంచు
గట్టిగా నొక్కి చెప్పెదు ఽ కన్నతండ్రి.

విక్ర—లోకాచారమెఱుంగక మాట్లాడుచున్నావు కాని,

గీ. రోవెలందుల యిండ్లకుఁ బోవునపుడు
తమ్ములమొసంగు మిగుల ప్రేమమ్ముతోడ
కాపులిండ్లను గరణాలు కాలువెట్ట
నగ్గియుఁ బుగాకునిచ్చు మర్యాదకొఱకు.

అట్లనే వారివారి యాచారంబుల ననుసరించి వచ్చినవారల మర్యాదఁజేయుట విధాయకంబగుటచేసి నావిధి నేనొనర్చుకొనవలెంగదా! గౌరవపూర్వకంబుగ నొసంగిన దెట్టివస్తువయైనను ఆదరించితీరవలెనుగాని తిరస్కరించఁగూడదు. అట్లు తిరస్కారభావము జూపినచో మనంబున కెంతయో ఆందోళనము కలుగును. మనస్సున కానందము లేని జన్మము నిరర్థకంబు. ఆనందమునకు మించిన వస్తువు ప్రపంచంబున నేదొండు లేదు. అట్టి యమూల్యమైనట్టి యానందం బనుభవించుటకుఁ బ్రథమసోపానము సురాపానమే సుమా!

మాధ—తండ్రీ! ఈధర్మోపదేశము మున్నెన్నఁడును నాకొనర్చి యుండరైతిరే!

విక్రి—నేనుగూడ మొన్న మొన్న నేగదా దీనిపరమార్థమెఱింగినది?

మాధ—ఎవ్వరివలన?

విక్రి—ఎవ్వరివల్లనైన నేమి?

మాధ—ఇయ్యది సేవించినవారికి ముక్తిచేకూఱదనియే మీయభిప్రాయమా?

విక్రి—ఆహా! నాసిద్ధాంతమంతియే!

మాధ—అంతియేగాని ధర్మాధర్మవిచక్షణ యొక్కటియే లేదన్న మాట.

విక్రి—ఏకాలమునకేది యానందసాగరమున నోలలాడఁజేయునో అది యేధర్మము. దానిని మించిన ధర్మము మఱిలేదు.

మాధ—తండ్రీ! ఆనందమనుభవించుట యులఁగాదు.

గీ, ప్రకృతివీక్షించి యానంద కొదఁగవచ్చు
హాస్యకథలవిని యానంద కొందవచ్చు
పరులకుపకృతి సానంద కొదఁగవచ్చు
అధములనుగూల్చి యానంద కొందవచ్చు.

మఱియు ప్రజాసౌఖ్యమే తనసౌఖ్యముగా యోచించి స్వీయ గౌరవము నిల్పుకొని, యాత్మలాభపరాయణత్వమును బాఱఁదోలి సత్క్రియాచరణదక్షులై శాశ్వతానందపదవిని బొందవచ్చునుగాని తాము చెప్పిన యానందంబు క్షణకాలానందము. పరమాసహ్యకరము. సందాకరము. సజ్జనదూష్యంబు. ఇహపరసౌఖ్యనిరుద్ధప్రవర్తనంబు. దైవశిక్షణాపాత్రంబు. అట్టి తుచ్ఛసౌఖ్యంబుల కాశించుట పరమమూర్ఖంబు. చిన్నవాఁడనై తమమాటలలక్షింపక నెదురాడుచుంటినని నాపైఁగినియకుఁడు.

విక్రి—నిన్నట్టు లధమదశయందు పీడివచ్చితిఁగదా! దైవవశముచేతఁ జాలకాలమునకు నిన్నుఁ జూడఁగంటినిగదా యన్నగౌరవభరంబున నామాట నిరాదరింపవని యెంచి యెంత ప్రార్థించుచున్నను నాహితంబు నీవీనులకెక్కకున్నయది నాదుగురువువలన దీని మాహాత్మ్యముఁ దెలిపించెద నప్పుడైన నంగీకరించుము.

మాధ—నాకన్నుల కమ్మహసీయుని నేల గాంచఁబఱచెదవు నాజన్మమెందులకపవిత్రపఱచెదవు. నన్నేల నిర్బంధింతువు. ఇహపరంబులకేలఁ జెరతువు. కులధర్మంబులేల నడుగంట జూతువు. నామనంబునేల వ్యాకులతచేఁ గృశింపఁజేతువు. దైవశిక్షణమునకేల నన్ను పాత్రునిఁగావింతువు. నలువురిచే నేల ఛీ ఛీ యనిపించెదవు. నిన్ను బతిమాలెదను. నీపాదంబులకు మ్రొక్క

దను. నాకిట్టి దురుపదేశ మొనర్పకుము. అధర్మము. అధర్మము. అధర్మము.

విక్రి—కన్నతండ్రి నన్న చనువుచేత నన్ను నిందించెదవుగాక. సకలసద్గుణవిరాజితుండును, అస్మద్గురూత్తముఁడునగు నమ్మహానుభావు నిగూడ నధిక్షేపించుచున్నాఁడవు. పూర్వాచారపరాయణులెవ్వరో యెప్పుడో వ్రాసియుంచిన యాపాదుధర్మముల నేకరువుఁబెట్టుచు మత్కార్యము లధర్మములని నిందించుచున్నావు. మీఁదుమిక్కిలి రాజశాసనంబుల ధిక్కరించుచు వదరుచున్నాఁడవు. దీనిఫలితమేమగునో చూచుకొనుము. ఊరకఁజెడిపోక నామాటవిని దీనినంగీకరింపుము.

మాధ—తండ్రీ! అధర్మకార్యాచరణతిరస్కృతికి నాకేమిఫలితము గలుగును. ఒకవేళఁ గలుగుఁగాక.

సీ. ఆపరాత్పరుఁడిది ధర్మ । మనుచుఁదెలిపి
నిన్నువిశ్వాసమునఁజూచి । నన్నుఁబట్టి
ఘోరశిక్షలవిధియించి । కూల్చుఁగాక
నతనితను వాతఁడీకొను । నయ్యతండ్రి.

గీ. ఇది యధర్మ మధర్మమీ । విట్టిపనికి
దిగకుమని యంతరాత్మ బో । ధించుచుండె
గాఁ రానున్న సిలుగుల । కైననోర్తుఁ
గాని యీకార్యమొనరింపఁ । గలుగఁజాల.

కావున నన్ను వేధింపకుతండ్రీ!

విక్రి—ఏమిరా! నీవుమూర్ఖుఁడవై వదరుచున్నాఁడవు నీయెడ నింకఁ గాఠిన్యమువహించినగాని ప్రయోజనమున్నటుల గాన్పింపకున్నయదే! మదీయమగుకోర్కె నీవుదీర్పవేని నీహృదయంబు

మాఱి పశ్చాత్తప్తుఁడవగు నంతదనుక నిన్ను కారాగారబద్ధు నిగావించెద. చూచుకొనుము.

మాధ—జనకా! ఇంతియేగద.

చ. జనకుఁడవంచు నీహితము శాస్త్రవిరుద్ధమటంచు మున్ క్షమా
పణమును వేడి వేవిధులఁ బల్కిన వీనులఁ జేర్చకుండఁగా
రను నినుఁ జేర్చుచున్ బలుతెఱంగుల బాధలఁ బెట్టుదంచు నీ
కినుకను జూపెదేలఁ బరికించవె దైవమాన్యమైన న్యాయమున్.

శా. కారాగారము నాకు ప్రియమ్మగుచున్ [illegible] కష్టంబులెన్నేనిఁ జే
కూర్చన్ జేసిన నాదు ప్రాణములె [illegible] దురాచారముల్
గోరన్ వీనులఁ జేర్ప దేశహితమున్ [illegible] దే
శాభీష్టంబులఁ బాఱఁద్రోలుదుగద [illegible] ముమ్మాటికిన్.

అందులకిప్పుడే బద్ధకంకణుండనై బయలుదేరుచుంటిని—కర్మానుభవమును దప్పించుకొనుటకు నాతరముగాదుగదా. రానిమ్ము. రానున్నకష్టంబుల నెదుర్కొనియెదఁగాక.

గీ. పాపపుణ్యంబులరయుచుఁ బరమకరుణఁ
జూపుచు త్రిలోకముల నేలుచుండు హరుఁడు
న్యాయమార్గిగఁ జూచుచున్నాఁడు మనదు
చర్యలన్నిఁటి నాతఁడే సాక్షి మనకు.

విక్ర—అవును. ఆతఁడే సాక్షియై నిన్ను సంరక్షించినప్పుడే చూచెదను. లెమ్ము. అంతవఱకును నీవు కారాగృహావాస మొనరించుచుండుము. ఓరీ! ఎవరురా అక్కడ.

రాజభ—(ప్రవేశించి) దేవా! సెలవు.

విక్ర—వీని చేతులకు నాయెదుట సంకెళులఁదగిలించి తీసికొనిపోయి మఱల నాయుత్తరువగువఱకును గారాగృహమందుంచుము.

రాజభ—చిత్తము. (పోవును)

మాధ—(తనలో) తండ్రీ! శ్రీమన్నారాయణమూర్తీ!

మ. ప్రితుకాసింపను నాదుకష్టముల సం ॥ రక్షింపఁబ్రార్థింపనే
  గతినైనన్ భరతోర్వికుప్రియులఁ జ ॥ క్కన్ బెట్టి సన్మార్గశీ
  లత, ధర్మంబును న్యాయమున్ నిలిపి యా ॥ హ్లాదంబుచేకూర్చి ని
  యతినైపుణ్యముఁజూపవేఁడెదఁగద ॥ య్యా ధర్మసంరక్షకా.

ఓపరాత్పరా! సకలంబునకు సాక్షీభూతుఁడవై యింతకాలము నుండియు నీధర్మపరాయణత్వమునుజూపక మిన్నకున్నందులకు నిన్నే మనుకొనవలయును దండ్రీ.

గీ. ధర్మసంస్థాపనార్థమై ॥ తండ్రి! నీవ
  యవతరించెదవని యార్యు ॥ లాడుచుందురు
  అదిమోసజమేనిప్రజపైని ॥ హ్రాదినిలుపుచు
  బిరుదమును నిల్పుకొనుమయ్య ॥ వేగకృష్ణ.

ఉ. కల్లదుకాణముల్ ప్రబలెఁ ॥ గార్యముమీాఱె కుతంత్రసంగతుల్
  వల్లనునిండె నల్దిశలు ॥ పాపముహెచ్చయె రోవెలందులున్
  కొల్లఁగగొట్టుచుండిరి గనుం ॥ గొనవేదెస నేనిగానని
  వల్లనెగాని పాపమిఁకఁ ॥ బ్రిద్దలుగాదు హారీ! మహాప్రభో.

రాజభ—(ప్రవేశించి) దేవా! సంకెళులఁదెచ్చితి.

విక్రి—అట్లయిన చేతులకుఁ దగిలించుము.

రాజభ—(అట్లొనర్చుచుండ)

మాధ—తండ్రీ! అధర్మకార్యమునకుఁ బూనుకొంటివి. దైవభీతివదలితివి. న్యాయమను బరిత్యజించితివి. పాపకూపంబునఁ బడిపోవుచుంటివి. భగవంతునకెంతటి శ్రీమంతులైనను పాపాత్ముల గుపట్ల దాక్షిణ్యములేదుసుమా! నవీకట్టడికార్యంబును తల

పెట్టుటకుముందు బాగుగా నాలోచించుకొనుము. ధర్మప్రతిష్ఠా
పనకొఱకు నెట్టికష్టంబులనైన ననుభవించుటకు నేను సిద్ధపడి
యున్నాఁడనుసుమా! పాపమేనాఁటికైనఁ బటాపంచలగునని
నమ్ముము.

విక్ర—ఓరీ సేవకా! నీవింక వీనిని నావలకుఁ గొనిపొమ్ము.

మాధ—ఛీ! నీవు నాకింకెక్కడితండ్రివి నేనెక్కడ పుత్త్రుండ
ను! నీమోమువిలకించినచోఁ పంచమహాపాతకములుగూడ బుట్టఁ
గలవు. నీవు రాజువే గానిమ్ము నాకుఁ గొరతనే విధింతువుగాక.

గీ. భారమంతయు శ్రీహరి । పైనివైచి
పోవుచున్నాఁడ నీ పాప । పుణ్యమతఁడు
సాక్షియై చూచుచున్నాఁడు । చక్కఁబెట్టఁ
గలఁడుమనవైరమెల్ల నో । తులువ! పలువ!

విక్ర—ఓరీ మూర్ఖా! ఏమిరా పేలుచుంటివి. ఇదె మదీయఖడ్గంబు
నకు నిన్నబలిగావించి నాక్రోధాగ్నిచల్లార్చుకొందును. జాగ్రత్త.

మాధ—ఓరోరీ! అధర్మప్రవర్తకా! వృథాప్రగల్భవాక్యవిశారదా!

గీ. ధర్మమార్గానువర్తి శ । స్త్రమునుజూచి
భీతిఁగాంచఁడు యిట్టిదు । ర్నీతిపరుల
కతనివాక్కులె శాపంబు । లగుచు మార
ణంబుగావించు భూమిభా । రంబుదీర్చు!

(అనుచుఁ బోవుచున్నంతలో)

విక్ర—(చివాలునలేచి కత్తినెత్తి) ఓరీతుచ్ఛుఁడా! ఏది నీశాపవాక్కు—
(అని విసరఁబోవఁగ కత్తి క్రిందఁబడును) ఛీ! ఛీ! ఏమి యపశకు
నమిది కన్నులేలకో మూసికొనుచున్నవి - (కత్తితీసికొనుటకు
వంగుచుండఁగనే తాచుబాము కాటువేయును) హా! హా! పా

ము పాము చచ్చితి చచ్చితి. అబ్బా మాటవచ్చుటలేదు- నిలువ జాల-హా-హా-హా-హా-మా-ధ-వా-నా య-నా—

మాధ—ఏమి? ఏమి?--(దగ్గఱకువచ్చునంతనే)

విక్రి—పాము ముట్టినదితండ్రీ రక్షించుము దుర్మార్గుఁడను ద్రోహిని.

మాధ—అయ్యో ఎంతప్రమాదము సంభవించినది ఏదీ? పామేది (అని వెదకుచుఁబోయి మఱలఁ బ్రవేశించునంతలోఁ దండ్రి ప్రాణంబులు విడుచును)

మాధ—హా! తండ్రీ నీమూర్ఖపుపట్టును మార్చలేక నకారణముగా దూషించితినే ఎట్టిమహాపరాధ మొనర్చితిని.

చ. కలుషపథంబునై తనకు గౌరవనాశకరంబునైనత్రో
గుడు కడు దూష్యమన్నవినఁ గూడనిపల్కులఁబల్కి యాగతిఁ
సిలుగులముంపఁజూడఁగన చించితి నీతులవెన్నొగాని వీ
నులఁబడనీకఁబోవని నిర్ఘ పెనుదుఃఖమునందు ముంచితో.

నాయనా ! నీకింతటి విపరీతబుద్ధి యేలఁ బుట్టవలెను. నానోటి వెంట నింతటి యువాకులను చవాకులనేల పేర్కొలించవలెను ! ఇదంతయును గర్మఫలితముగాక మఱేమితండ్రీ.

గీ. తల్లికై మోము వాచి నీ తపసువృత్తి
కింతచింతిల్లి చెల్లెలి కింతయేడ్చి
బిక్షుకునివేషమున వీధి వీధి తిరిగి
యట్టులుండక మఱలరా నానెనాకు.

వచ్చితినిహా. మేనయత్త యొనర్చిన యుపకారమేని యక్కఱకు రాక మఱల నేల జీవించితి. జీవించితినిపోఁ బ్రపంచంబున నిక నెచ్చటను పట్టణమే లేనట్టు లిచ్చటికి రానేల? నిన్ను విలోకించనేల! ఇట్టి విపరీతసంభాషణము జరుగనేల? నీవాకట్టడిపా

ముపాతఁ బడనేల? ఓదయామయా! పరాత్పరా! ఇదాతయు నీవిలాసము గదయ్యా

ఉ. భక్తుఁడు ప్రెముక్కనంచుఁ బని ఁ బడ్డది చిక్కి దురాత్ముఁడంచునీ యుక్తినిఁబన్నినావ మతి ఁ యుండదె వేఱొకతీరున తండ్రి నీ శక్తి నెవండు దూరఁగల ఁ శక్తుఁడు వాకిల దిక్కు కేదియా యుక్తినిఁగూడఁబన్ని పయ ఁ యుంచుము నాపయినిం క మాధవా

అయ్యో! ఇంక విచారించిన నేమి ప్రయోజనము.

త్రాగు—(చివాలున ప్రవేశించి) ఓరీ! దుర్మార్గుఁడా! నీవేరా! మహా రాజును వధించితివి.

మాధ—(క్రిందనున్న కత్తిని దూసి)

గీ. తగిన ప్రోత్సాహ మొసరించి ఁ తండ్రిగారి
పట్టిదుస్థితికినిదెచ్చి ఁ నట్టుపాపి
వటరనీవోరి దుర్మతి ఁ యదరిపడకు
నోరు మూయుము మూర్ఖ ని ఁ న్నును వధింతు.

గీ. సాధుచరితుని న్యాయవి ఁ చారదక్షు
నీగతికిఁ దెచ్చి కుల్కెదో ఁ రీ దురాత్మ
ద్రోహుఁడవు స్నేహితుని ఁ తోడఁగూడి
యచటనే సుఖపడఁ బోర ఁ అధమచరిత.

(పొడిచి చంపును.)

గీ. ధర్మమడుగింటఁజేసి స ఁ త్యమును బాఱఁ
ద్రోలి న్యాయమువర్జించి ఁ తులువ త్రాగు
బోతు ధనము లంజెటెకంబు ఁ చేత బ్రదుక
నెంచితివె వారివీరి వం ఁ చించుచుండి.

గీ. కంటఁబడినట్టి స్త్రీలను గట్టితెచ్చి
బల్మిబాధింతువఁట నావి వరుసలేక
నిట్టిదుర్వృత్తిలోఁ బడి యెంత కాల
మిలను జీవింతు వోరోరి హీనచరిత.

(అని త్రాగుఁబోతును క్రిందఁ బడవైచి మీఁదనెక్కి కూర్చొని)

గీ అస్తమించెడి నీయర్క యుములు నేఁడు
గలుగుఁగావుత పుత్రజకు సౌఖ్యములు నేఁడు
క్షత్రియుఁడొకండు నీపాల కాలయముని
వలెను సాక్షాత్కరించుట వలన ద్రోహి

(అని గ్రుద్దుచున్నాఁడు)

త్రాగు—అయ్యా! ద్రోహిని క్షమించుఁడు. బుద్ధివచ్చినది. (అని గింజు కొనబోవును)

మాధ—ఓరిపరమదుర్మార్గా.

ఉ. పుట్టినబుద్ధి నీకిఁకను బుల్లలతోడ నెగాని పోదు నీ
యుట్టిదురాత్మునిన్ విడఁత్రు నా ప్రజ లెల్లరు గోలపెట్టినా
చుట్టును జేరి మొక్కరొకొ శుంఠవునిన్నిఁక వీడఁజాల నీ
దిట్టతనంబుఁ దీర్తు నలు దిక్కుల నిల్పుదు ధర్మముల్ ధరన్.

తోడి—ఏకతాళం

ప॥ ఓరోరి! కలుషాత్మభ్రష్టా-కూరిరా! మహాద్రోహి।

అ॥ ప॥ ఏరీతిగనాజనకునిచేసితి-వెంతగతికిఁదెచ్చితివాతని! నీ
దారుణమగువ్యభి-చారమునందున త్రాగుబోతుతనమందున
వానిన్।
చేరిచినూడిచిధనసర్వస్వము-చివఱకుఁబ్రాణముదీసినపాతకి॥ఓ
క్షమియించిననీవలన ఛాత్మతలఁముక్రిమముగపాడగుగాననిన్నికను
ఖడ్గధారచేఁగూల్చి కాకులకు-గావింతు తృప్తిగబలినిదె॥ ఓ

## పంచమాంకము.

త్రాగు—(మణుల గింజుకొనుచు)

మాధ—ఓరోరీ మూర్ఖా! ఎందుకురా గింజుకొనియెదవు.

సీ. మధువుగాదిది త్రాగి ॥ మత్తెక్కి పరులహిం
సలఁ బెట్టినీకు ద్రో ॥ హఫలముఁజూడ
రో కాంత యిదిగాదు ॥ సోకుగామున్నాబు
చేసుకనీదగు ॥ చేవఁజూడ
ఆఁడువారలుగారు ॥ అదలించి బల్మిబం
ధించి నీదగుతెల్వి ॥ తేటఁజూడ
తుచ్ఛుండుగాఁడు నీ ॥ తో జేర్చుకొనుచుదు
ర్నీతిబోధించి నీ ॥ రీతిఁజూడ
ధర్మసంస్థాపనార్థమై ॥ తరలివచ్చి
మీదుదుండగములఁజూచి ॥ మిమ్ముగూర్చి
భూమిభారంబుదీర్చి స ॥ మ్మోదముగూర్చ
నవతరించిననీపాలి ॥ యముఁడితండు.

(పొడిచి చంపును.)

మాధ—ఇక్కడికి నేనువచ్చినపనులన్నియు నెరవేఱినవి (రాజుభటుని వంకఁదిరిగి) ఏమిరా! మూర్ఖా! చేతులకు సంకెళులఁ దగిలింతువా?

భటుఁడు—అయ్యా! రాజాజ్ఞ నిర్వర్తించుట మావిధియగుటం జేసియట్లొనర్చితి. మహాప్రభూ? క్షమించుము.

మాధ—ఇఁకఁగనుమెలఁగి ప్రవర్తింపుము పొమ్ము.

భటు—చిత్తము (పోవుచుండ)

మాధ—ఓరీ? యిటురమ్ము. నీవుపోయి జాంఘికునిఁ బిలిచి యిటుల చాటించుమని చెప్పుము. దుర్మార్గులైన రాజును మంత్రియు చచ్చిపోయినందున విక్రమవర్మపుత్రుఁడు మాధవవర్మగారు సింహాసనమధిష్ఠించుచున్నారలు కానఁ బ్రజలెల్లరు సుఖముగా జీవించవచ్చును. ఈవిధముగా జాటింపఁబంపుము. అంతియేగాక నేనిచ్చు యీలేఖఁగొనిపోయి సదానందవర్మయెచట నుండెనో తెలిసికొని వానికిఁ దక్షణంబందఁజేయుము. పొమ్ము.

భటు—చిత్తము (పోవుచుండ)

మాధ—ఓరీ! యింకొకతూరియిటురమ్ము. నీవుముందుగొందటి భటులను దోడ్కొనివచ్చి యీశవముల కడఁ గాపలా యుంచుము. నేను బోయి యుచితక్రియలనిర్వర్తించు తెఱువాలోచించెదను.

భటు—ఆజ్ఞ.

(అందఱు నిష్క్రమింతురు)





శ్రీ

# శారదా విజయము.

## —ప్రథమాంకము—

ప్రవేశము—వెంకటశాస్త్రి రామావధానులు—

వెంక—ఇదుగో! రామావధాని! కీర్తివర్మగారివివాహమునకు వచ్చి నావు కావేమోయి!

రామ—నేనొక కార్యాంతరమునకుఁ బోయియున్నాను. అందుచే వీలుకలుగ లేదు.

వెంక—ఎక్కడి కేమిటి? కాస్త చెబుదూ.

రామ—నిరంకుశపురప్రభువు చచ్చిపోయినాడు. వానికుమారుని పట్టాభిషేకమునకుఁ బోయియుంటిని.

వెంక—సంభావన లేమిచ్చినారు?

రామ—వరహా వరహా యిచ్చినారు సంస్కారులకు.

వెంక—నీపేరు సంస్కారులపద్దులలో పడ్డదా?

రామ—ఆహా! పడ్డది వాడిదయవల్ల.

వెంక—ఎవరిదయోయ్! నాచెవిని వేయగూడదా యేమి?

రామ—ఏమిరహస్యమా? వాకక్కడొక సహాధ్యాయియున్నాఁడు. వాడిపేరు శాంభొట్లు. వారికి పౌరోహితుఁడు వాఁడే.

వెంక—అటువంటిపద్దుంటె నాదాకా రాసిస్తావు!

రామ—నీవు మాతో వస్తావు? మాటవరుసకంటావుగాని; సరేగాని కీర్తివర్మగారి వివాహం బాగా జరిగిందా?

వెంక—ఏదో ఎఱుగవూ! సంసారిపక్షము. బాగోగులకేమిగాని రత్నం వంటిపిల్ల. మణిపూసవంటికుఱ్ఱవాఁడు. వారిద్దరికి భగవంతుఁడు కుదర్చినందులకుఁ జెప్పాలి. వాళ్ల దాంపత్యంచూస్తే ఎంతముచ్చటయిందోయ్.

రామ— పద్దేమాత్రింపడ్డది?

వెంక—బొత్తుగా లేకపోలేదు. అవారవారు.

రామ—ఏదో సిఫార్సుకోలేను. కొట్టావుడావు.

వెంక—ఊరుకుంటే యెట్లానాయనా? పదిమందిపిల్లలూ నేను బ్రతకాలి.

రామ—సరేగాని పిల్లదాని దేవూరు? వారెటువంటివారు? వారివల్లఁ గూడ పాంతేమయినా పడ్డదా?

వెంక—అదేపూజ్యం. పిల్లదానిగొడవచాలావున్నది. మొత్తముమీఁద గుణవంతురాలు.

రామ—అంతగొడ వేమున్నదోయినాయనా! చెప్పు. చెప్పు. కూరుచో సావకాశముగా మాట్లాడదాం.

వెంక—(కూర్చుండి) ఎక్కువేమిలేదు. పిల్లకు తల్లిలేదు. తండ్రివుండియు లేనివాండ్లలో జతే. అన్నగారొకాయన ఉన్నాఁడట. కాని వారిజాడవారికి వీరిజాడవారికి లేదు. ఎవఁడో ఒకదుర్మార్గుఁడు మీనాయనను జూపి చెదరా అని తీసికొనిపోయి పెట్టరాని కష్టాలన్నీ పెట్టి తనతోఁ గలియుమని నిర్బంధిస్తే ఆపిల్లది. వొప్పుకోలేదని చీకటికొట్లోబంధిస్తే యీకీర్తివర్మగారాదారినివస్తూ పాప మాయమ్మాయి మేడ్పువిని రక్షించి తీసుకవచ్చాఁడు

వారికివారికి భగవంతుఁడు గూర్చాఁడు. ఏదో అయిపోయింది.

రామా—అయితే తెలియకడుగుతాను. భార్యనుఁగట్టుకొన్నాఁడుగదా, పెద్దసంసారమీఁదాఁలి. అందులో సుక్షత్రియవంశమున బుట్టినవాఁడు. ఆరాజలాంఛనాలు,ఆఘోషాలు,అమర్చుకోడానికి తగినధన మేదోయి.

వెంక—అది యదృష్టమునుబట్టివుంటుంది. ఆపిల్లది అడుగుపెట్టినవేళా విశేష మేమోగాని అతని వివాహానికెంతమందివూనుకొన్నారు ఎంతవైభవముజరిపారు. కానుకలెన్ని! కట్నాలెన్ని! అబ్బా! రాజాధిరాజులయిండ్లలోఁగూఁడ అంతగొప్పగా అవుతుందని అనుకోనుసుమీ.అయితే నీవు పట్టాభిషేకమునకు వెళ్ళితివిగదా? ఇదుగోచూడు. గడియగడియకు పట్టాభిషేకాలేనా? మొన్ననేగాదుటోయి పట్టాభిషేక మయింది? వడసారమేడాదికాలేదు.

రామా—అతఁడు మహాశూరుఁడు; ప్రజాఘోషకూడా చాలాయెక్కువైపోయింది. అబ్బా! ఆపరిపాలనము, ఆకఠినశాసనములు దలంచుకొన్న గుండెలు వ్రియ్యాలైపోవునయ్యా? నాయనా! ఆయనకొకమంత్రిగారు తగుల్కొన్నారు. రాజు పేరునకేగాని అతఁడే రాజరికమంతయు. ఇట్లా పాపం పెంచారు పెంచారు. ఒక్కమాఱుగా పటాపంచలైపోయింది. భగవంతుఁడు కళ్లుతెఱచాఁడు. ఇదుగో చూడు వెంకటశాస్త్రీ!

గీ. పాపపరిహారమొనరింపఁ బైనదేవుఁ
డొకఁడుగలఁడని భయపడు చుండి నీతి
తోమెలంగుచునున్నచో దుదురువాని
దయనుముక్తిగణింతు య ధార్థముగను.

వెంక—ఎల్లా చచ్చాడేమోయి.

రామా—ఎల్లాగయితేనేమి చావడానికి; పాముగఱచింది చచ్చాఁడు. మంత్రిని రాజకుమారుఁడు అంటే తెల్సిందా? ఇప్పటిరాజుగారు పుణ్యమాఁగట్టుకొన్నారు.

వెంక—ఇంకావిశేషాలు చెప్పవోయినాయనా! బొత్తుగా కనుపించనే కనుపించవు. కనబడ్డప్పుడైనా కాస్సేపుగూర్చుండవు. ఇప్పటి రాజుగారి ప్రభుత్వ మేమైనా బాగున్నదా!

రామా—వేఁవేయకుగవలయునా! ప్రజలందఱు హాయిగా నిద్రించుచున్నారు. ప్రపంచమంతా యొక్కటీయాఱుగా తల్లకిందైపోయినట్లుగా యున్నది.

వెంక—ప్రభుత్వమంటే అట్లావుండాలోయ్. ప్రజాసౌఖ్యమే రాజుసౌఖ్యము. ప్రజలంతా గొల్లున గోలపెట్టుతూవుంటే ఆరాజరికానికేమివృద్ధివుంటుంది! జనవాక్యంతు కర్తవ్యమ్మని పెద్దలవాక్యము నిత్యమూ వింటూనే యుంటామయ్యోను.

రామా—కీర్తివర్మగారి కొక్కడనో సేనానాయకత్వ మవుతుందని వాడుకగానున్నది నిజమేనా?

వెంక—ఇంకా నిజమా అని అడుగుతూవున్నావా? అతనికీర్తిచంద్రకలిదివఱలో నలువైపుల బాగావ్యాపించియుండడముచేత ఈ శ్రీనగరమహారాజావారతని వివాహసమయమున వచ్చి పదిదినములుండి వెంటపెట్టుకొని వెళ్ళినారు.

రామా—పెండ్లి అవడమూ ఉద్యోగంగుదిరిప్రవేశించడం కూడా అయిందిగా! ఎంత అదృష్టవంతుడోయి. భార్యనుగూడ తీసికొని వెళ్ళినాఁడా?

వెంక—ఇంకాలేదు. ఆతనిచిరస్నేహితుఁడైన లక్ష్మణవర్మగృహమునందుంచి వెళ్ళినాఁడు. మఱలఁ గొద్దిదినములలో వచ్చి తిసికొని వెళ్ళఁగలఁడు. సరేగాని మళ్ళ ఎక్కడయినాపద్దులుంటే కాస్త చెబుతూవుండూ. నిన్ను మఱచిపోనులే. అయితే పట్టాభిషేకస

నారాధనలలో పిండివంటలు దిట్టంగా మెక్కి వుంటావు. నేనుతిన కష్టాయినపోనీగాని వాట్లపేరయినా చెబుదూ. విని మైనసంతోషించెదను.

రామా—గారెలు, బూరెలు, పూర్ణంబూరెలు, ఒబ్బట్లు, పులిహోర, పకోడీలు, లడ్డూ, దూత్ఫేడ, సాల్వాలు, ఆవడలు, ఉపమాలు, జంతికలు, ఇడ్డీనులు, జిలేబి, కారప్పూస, కారబ్బూంది, కాజాలు, సజ్జప్పాలు, పెసరట్లు, రవ్వదోసెలు, బర్ఫీలు యింకాయింకా చక్కరపొంగలి, దద్ధోజనం అబ్బా! చెప్పలేనయ్యా వాటిపేర్లు. నోరువూరుతుంది.

వెంక—ఇవన్నీతింటే కడుపునొప్పన్నా రాలేదటయ్యా!

రామా—వస్తేనేమి మహారాజు మనబోటివాళ్ళంతా యీఅవస్థలు పడుతూ వుంటారని వామరఖు, పిప్పరమెంటరఖు, సోడాప్పుప్పు చక్కగా సరఫరాచేయిస్తూ వుండేవాడు. గనుక నాసామి రంగా అని అట్టే కూరుకునేవాళ్ళము.

వెంక—ఆభగవంతుడు మనవాండ్లకింతాశ యెందుకు పెట్టాడోగాని.

గీ. ఘృతము గరిటెడైన । గృహమునందున వేసి
కొనరు పరులయిండ్ల । గూడుతినగ
పరువులెత్తిపోయి । వాయవాయలమెక్కి
పొట్టబరువువేసి । మొత్తుకొందు॥

ఇదంతా యిట్లాపెట్టు. సంతోషపూర్వకముగా వారిచ్చుసంభావనలకు మనవాండ్లుతృప్తిపడరుగదా. తోరణాలు తెంపడం; మనవాళ్ళలో మనవాళ్లు పోట్లాడుకోవడం; జంఝాలు తెంపుకోవడం; అబ్బా! యెన్నికష్టాలైనను పడుతారుగదా.

రామా—పోనీలే. ఎవరివృత్తి యెవరుమానుతారు. మనవాళ్ళను మనమే వెక్కిరించుకోవడమా. ఇంక పోదాముపద నడువు.

(ఇరువురునిష్క్రమింతురు.)

---



శ్రీ

# శారదావిజయము.

## —సప్తమాంకము—

ప్రవేశము మాధవవర్మ—సదానందుడు

మాధ—ఆర్యా! సదానందా! ఈవఱకున్న రాజశాసనంబు లెంతటి కాఠిన్యదశయందున్నవో అయ్యవి ప్రజానీకము నెట్లు బాధించుచున్నవో తామెఱుంగనివిషయముగాదు. అట్టి క్రూరశాసనభూయిష్ఠమైయున్న యీరాజ్యంబును నేఁటికి నేను పాలింపవలసియున్నది గదా! మూఁడు నెంతటికష్టము వహించవలయునో!

సదా—దేవా! అందువలనఁ గష్టములున్నటుల నాకేమియుఁ దోఁచుటలేదు. పూర్వశాసనముల కనుకూలవర్తులరై కేవలధనార్జనాపరు లగువారికి మాత్రమే తమశాస్త్రంబులు కష్టంబుగాఁ గాన్పించగలవు. రాష్ట్రమందలి ప్రజలెల్ల రాక్రూరశాసనంబులకుఁ దాళఁజాలక అనుదినమును వేయిదేవుళ్లకు మ్రొక్కుకొనుచుండ నీశ్వరానుగ్రహమునఁ దాములభించుట మాభాగ్యమే యనితలంచుకొనుచున్న ప్రజలు తమశాసనంబు లాచరణంబులోఁ బెట్టుటకు సంసిద్ధులైయుండఁ దమకొక్కింత కష్టంబుగలుగునా! తామంతః కష్టమందుండఁగాఁ బ్రజలుమాచియూరకుందురా.

మాధ — అమాత్యశేఖరా! చూచితిరా! మీనియామకము మీకొంపనేమియుంచినది మీరాఁగతి గజగళమునఁ బూలహారమువై
చుచు నట్టినియమ మేర్పరచకున్నచో యీరాజ్యంబున కింతటి విపద్దశ రాకుండెడిదిసుఁడీ! అప్పుడు తామెవ్వరో నేనెవ్వరనో గదా.

నవా — నేనొర్చిననియామకమే యుక్తమైనది ఇప్పుడు తలంచుకొనుచున్నాఁడ. ఏమందురా! నేనట్టినియామకమే యేర్పర్చకున్నచోఁ దామీవిధముగ మూకుఁబరిపాలకులగుట సంభవించదుగదా! ప్రజలెల్లరు దీపారాధనమునేర్చుకొని తమనామమును పదేపదే స్మరించుకొనుచు భగవానునారాధించుచుందురు.

మాధ — అస్వామి! ఇందునాఘనత యీవన్మాత్రమేనియులేదు. తమవంటిపెద్దల యాశీర్వచనప్రభావమున్నచో నస్మదాదులెంతటి ఘనకార్యములైనను నవలీలగడవఁగలరు. ఆర్యా! ప్రజాహితశాసనంబులనుగూర్చి నాయభిప్రాయమును రాజసభయందిట్లు వ్యక్తీకరింపఁదలఁచియున్నాఁడ. ముందుగఁదమమోదంబును బడసినచో నామనంబున కెంతయో తృప్తికరముగనుండును. (కాకితమొకదానిఁదీసి) అస్మద్దేశీయులారా!

సీ. క్రూరశాసనములమీరు కుందునట్టి
దినములుగతించిపోయె మీ మనములందు
స్వాస్థ్యములఁజెంది సుఖులరై పరమముదము
తోడనుండంగఁగోరుచు నున్నాఁడమిమ్ము.

ఇఁకమీఁద జారచోరత్వములకుఁ దావులేకుండునట్లు వలయురక్షణాసైన్యంబును నియమించితి. దుండగీయుల దురాగతంబులడంగు నేర్పా

టులొనర్చి వలయున్యాయస్థానంబుల నేర్పరపించితి. మద్యపానాది దురాచారములను బూర్తిగనిషేధించుచు వలయుశాసనంబుల స్థిరపఱిచితిని. ఆర్యమతసాంప్రదాయ విరుద్ధాచారములొనర్చుచున్న వెలకాంతలకు వివాహసంబంధనము లేర్పరిచితి. ఈవరలో నట్టి హీనవృత్తియందుండి ప్రవర్తించినవారలకుం దగినవృత్తుల కల్పించితి. జాతీయాభివృద్ధికి తగినవిధానము లేర్పఱచితిని. సమస్తకళల పునరుద్ధారణకొఱకు వలయు పాఠశాలల నేర్పఱచితిని. ఈవరలోం బ్రజలను పీల్చిపిప్పిచేయుచున్న విపరీతపుపన్నులం దగ్గించి ప్రజోపయోగకరములగు పనులకుం గావలసిన ద్రవ్యమును మాత్రమే ప్రజలనుండి రాంబట్టుటకు వీలుచేసితి. కాన మీరింకనిర్విచారముగ మెలంగుచు మీమీకష్టంబు లెప్పటికప్పుడు మీప్రతినిధులమూలమున మాకెఱుకపఱచుచుండిన నవుము కట్టుకొని శక్తికొలంది సాయపడనుద్యుక్తుండనై యున్నాండను. ఆర్యా! ఇదియ నాప్రకటనము. ఇందు నింకనేవైనం జేర్పదగినవున్న యెడల దయయుంచి తెలుపుండు.

సదా—దేవా! సకలసద్గుణగణవిరాజితుండవై సమస్తవిద్యల నార్జించి పరోపకృతికిం బాటుపడం గంకణముం గట్టుకొనినమీరలు ప్రజాసౌఖ్యంబున కేవియవసరములో వానినిగుర్తించకుందురా! నాయట్టివాండు దేవరకు లోపములుదెలుపుట గూడనా? ఎంతమాటంటిరి?

మాధ—ఆర్యా! నాతండ్రి యింతటివాండై పోవునని స్వప్నమునందేని దలంచనైతిని సుండీ?

గీ. తల్లిజీవించియున్నప్డు ♦ ధరణియెల్ల
చేతిలోనున్నవాండు యీ ♦ రీతింగాక
ప్రజలకామోదుండై పరి ♦ పాలనంబొ
నర్పంగాలేదె నాతండ్రి ♦ న్యాయవిధిని.

చెడు కాలము చేరువగు వేళకు నిట్టివిపరీతంపుబుద్ధులు పుట్టుచుండుట స్వాభావికమని యార్యులుపల్కు పల్కు లకిప్పుడు తార్కాణంబుగంటి ని. సదానందదేవా! మఱియొకవిషయము నాహృదయపీఠిజేరి యనుని మేషంబునుగలఁచి కలఁచి నాకతివిచారమును గలుగఁజేయుచుండును.

గీ. ఏలుటకుభూమియున్నది । చాలధనము
గలదువాహనములుపెక్కు । గలవుకరులు
హయములున్నవి యెన్నియో । యైననేమి
ఫలము దినుటకు నెవ్వారు । గలరునాకు

గీ. భార్యయాలేదు తల్లియా । పరమపదము
జేరెనాతండ్రియిటు మృతి । జెందెనాదు
ముద్దుసోదరిననువీడి । పోయెనిటులఁ
దుదకునేకాకినాచేను । బ్రదుకవలసె.

గీ. మామ కే నిట నుంటినన్ । మాట తెలియ
దయ్యెదెలిసిననేమి మే । నత్తయంత
కక్షవహించి యుంట । నాకడకువారు
వత్తురనియాశయునునన్ను । వదలిపోయె.

మంత్రిసత్తమా! వీరివారిమాటకేమిగాని నాసహోదరిని దలంచుకొని నప్పుడెల్ల నాగుండెలవిసిపోవుచుండును.

ఉ. అంతటికష్టముల్ దొడరి । యాఁకటిబిచ్చము నెత్తుకొన్న ర
వ్వంతయుఁజింతనొందకుల । వంబును ఖేదమునొందవత్త గా
రంతటికక్షబూనిననుసంతముఁ । జేయఁగఁబూనుకొన్న నే
నెంతగధైర్య[illegible]సినను । యీపరితాపము నార్పనైతిగా.

(చెల్లెలినుద్దేశించి) హా సహోదరీ! ఎంతవిచారమును బెట్టితి వమ్మా!

మ. నిలుచున్నన్ బనుకొన్నఁ గూర్చొనిన గా । నిన్ దండిదిన్నప్పుడున్
గలలో నేనియు నిన్ వెగాన్పడుచున । న్నా! చిన్ననాఁడెట్టులన్
బలుకన్ లేదె విడన్ క్షణంబనియుటుల్ । భావ్యంబె నన్బాయ నా
పలుకుల్ వినులఁ జేరనయ్యెడిని నా । ప్రాణంబ! నాసోదరీ

గీ. భిక్షుకుఁడనౌట నానాఁడు । పెట్టనైతి
నిట్టు రాజత్వమబ్బినఁ । బెట్టనైతి
పట్టెడన్నంబుఁ జేతితో । కట్టలేక
పోయినను నున్న నొకరీతి । యూరాయె నిఁక.

గీ. ఒక్క గర్భాన నుద్భవ । మొందినట్టి
సోదరిని గావలేనట్టి । యాదరిద్రు
జన్మమొక జన్మమాయట్టి । చవటమనుట
భారమే గద భూదేవి । పాపమేమొ.

ఓయమాత్యశేఖరా !

గీ. కన్నులా మూతపడి నాకు । మన్నుమిన్ను
గాన్పడుటలేదు దేహంబు । కంపమొందె
నడకఁ దొడఁగెను గాళులు । గడగడనుచు
దీయసోదరి జ్ఞప్తికిఁ । దెచ్చుకొనుట.

చచ్చిన తల్లిదండ్రులపై యింకనొకటే యాశగదా! బ్రతికియున్న చెల్లెల
పై నట్టి యాశాలతను ద్రెంపుకొనుట యేరీతి సంభవించును.

గీ. బ్రతికియున్నంతదనుక । సేవలన నేని
మఱలఁ జూచెదమనునాశ । మానవస్వ
భావికంబౌట మనములో । బలను దఱచి
తఱచి యేడ్పించుచుంట త । థ్యంబుగాదె

సదా.—ఆర్యా! తమవంటివారు విచారించుట ధీరోదాత్త లక్షణంబు
గాదు. కష్టసుఖంబులు కావడికుండలవంటివిగాని స్థిరముగా ని

లుచునవిగావు. తగువారిని నియమించి తమసోదరీమణిని వెదకించుదము. కాన శాంతినహించవేఁడెదను,

మాధ—మంత్రిపుంగవా! నామనంబునకు శాంతిగాక యేమున్నది! నాకష్టసుఖంబులకు సంతోషసంతాపములు చెందఁదగినది నా సోదరీమణియొక్కతియేకదా! కాలకర్మవశంబున నావీఁగూడదవ్వైనది. నేనొక్కఁడనేతాయునై పట్టెడన్నంబుకొఱకు నీపొట్టను చేతబట్టుకొని జీవచ్ఛవంబనై బ్రతికియున్నాఁడను. ఈనాటిసంగతియా, ఈనాటిలోకమా? ఇంక నాసహోదరి జీవించియుండునా ?

గీ. నాకొఱకు నెంతిగాఁ ౯ దాను శోకమంది
ప్రాణములవీడెనో లేక ౯ మానహాని
కోర్వఁజాలకనాచెల్లి ౯ గుండెవ్రీలి
తాదృశావస్థనొందెనో ౯ యేదొజరగె.

[అంతనొకరాజభటుఁడు ప్రవేశము]

మాధ—ఎవరురా నీవు! అంతరోజుకొనుచు వచ్చుటకుఁగతమేమి?

రాజభ—దేవా! అవధరింపుము. ఎవ్వరో యొకస్త్రీ యార్తయై విలపించుచు దేవరిదర్శనంబభిలషించి హజారముకడ నిరీక్షించియున్నది.

మాధ—సదానందమూర్తీ! స్త్రీయట. పోయి యెవ్వరో విచారించి తోడ్కొనివత్తురా?

సదానం—చిత్తము (వెడలును)

మాధ—ఆర్తయైవిలపించుచువచ్చినయాస్త్రీ యెవ్వరు చెపుమా ! ఇంకను నాపరిపాలనంబున గుండగీయులచేఁ బరిభవింపఁ బడు స్త్రీలుగలరా ! ఎంతవిపరీతము.

గీ. తగినరక్షకసైన్యమున్ ? తటనునిలిపి
జాగ్రతగనేలు నాకురా ? జ్యంబునందె
యింతవిపరీతమా! యిది ? యెట్లుగలిగె
వింతగాఁదోఁచుచుండెవృ ? త్తాంతమేమొ.

(అంత సదానందుఁడు శారదను వెంటఁబెట్టుకొని ప్రవేశము)

శారద— మహారాజా! అనాధను; రక్షింపుము.

మాధ—(తనలో) ఈబిడయందు నాసోదరీమణి లక్షణంబులుగాన్పించుచున్నవి. శారదయా? కాదుకాదు. శారదయిచ్చటేలకలదు! పోలికచేనట్లున్న మరెవ్వరైననఁగావలయును. అయినను తొందరయేల? నిలకడమీఁదఁదెలిసికొందము. (ప్రకాశముగా) ఓ కాంతామణీ!

గీ. శరణమిచ్చితినమ్మ ? నీస్వాంతమందు
భయమువీడగదమ్మయీ ? ఫక్కి రాగ
తంబువచియింపుమమ్మదో ? హంబునెవరు
తలఁచిరమ్మ! రవంతేని ? దాచకమ్మ.

గీ. నీదగునివాసమేదమ్మ ? నీదునామ
మేమిటమ్మ, మగండెవ్వ ? రేమిటమ్మ
సోదరునిరీతిగా నన్ను ? జూడుమమ్మ
తగినసాయమ్మొనర్తుయ ? థార్థమమ్మ.

శారద—(తనలో) నాకిమ్మహానుభావుండు నాసోదరునిగనే గాన్పడుచున్నాఁడు. అయ్యో! నాయట్టి దరిద్రురాలికంతటిభాగ్యమా!

గీ. బిక్షుకుండేమియీరీతి ? విపులరాజ్య
మేలుచేఁడౌటకేమి యే ? లీలఁబోసఁగు
మనుజునిఁబోలుమనుజుఁడుం ? డునుధరిత్రి
నంతమాత్రాననాయన్న ? యగునెయితఁడు.

(ప్రకాశముగా) దేవా! నాయూరుపేరులఁ దెలుపుకొనుటకు నాకుఁ గ
డుసిగ్గగుచున్నయది. ఏలనందురా?

గీ. క్షత్రియకులంబుమాది దో ॥ శ్శాలి నామ
గండతండేదిమోపని ॥ యుండిపురము
వదలిపోయినకతమున ॥ పాపియొకఁడు
మోసగతిదెచ్చినన్నిట్లు ॥ గాసిపెట్టె.

అయ్యా! ఆదురాత్మ్కుఁడు నన్నిట్లుపరిభవించుట రెండవతూరి. వానిపేరు
కూ్రరవర్మ

మాధ—అమ్మా! నీవెంతమాత్రమును సిగ్గుపడనక్కఱలేదు. నిజమూ
లోచింప సిగ్గుపడవలసినవాఁడను నేను. ఏమందువా?

గీ. నాఁదురాజ్యంబునందొక ॥ నాతియిటుల
పరిభవంబందుటనుయింత ॥ వఱకెఱుంగఁ
జాలకమహాపకారంబు ॥ సలిపినాఁడ
నాదిగ సిగ్గు తల్లిరో ॥ నీది కాదు.

శారద—(తనలో) కంఠస్వరముగూడ పాత్రదిగ నేయున్న దే. ఇంతలో
నాసహాయాదగునికంత మంచిదినముగూడ వచ్చినదా? ఎవ్వ
రైననేమి? నేనిమ్మహానుభావుని జూచినప్పటినుండియు నీత
పై నాకు సోదరభావ మంకురించుటయేగాక విశేషించి

గీ. మాధవుఁడుబాసిపోయెనట ॥ మాటగూడ
మఱపునకువచ్చుచున్నదీ ॥ మానవీయు
వదనమును మాటతీఱును ॥ వరుసతోడ
పిలుచుటారీతిగానుంట ॥ వలననాకు.

(ప్రకాశముగా) దేవా! తాము స్వజాతీయులరైనను, శరణా
గతరక్షణబిరుదాంకితులైనను క్షత్రియాంగన తన భంగపాటులఁ జెప్పు
కొనుటకుఁ గడు సిగ్గువహించుట తామెఱుంగనివిషయముగాదుకదా!

ఐనను క్షమాగుణసంపత్తిఁ గలిగి యాదరభావంబున నడుగుచున్నారు
గాన నీమాటకు నాయంతరాత్మ యంగీకరింపక దొందరించుటచేఁ జె
ప్పుచున్న దానను—నాపతి కీర్తివర్మ. అతఁడు శ్రీనగరమహారాజుగా
రివెంట నుద్యోగియైపోవుటసంభవించి తన చిరస్నేహితునియింటికడఁ
దాత్కాలికముగా డించిపోయె. ఆదంపతులిర్వురును నన్నెంతయో
వాత్సల్యమునఁ జూచుచుండిరి. అంత నొక్కనాఁటిరేయి నొక్కతెను
వారి యింటిసావడియందుఁ బరుండియుంటి. గాఢంబుగా నిదురఁబట్టు
టచే నేమిజరిగెనో నేనెఱుంగను గాని నాకు మెలకువ వచ్చుసరికి నేను
నట్టనడిసముద్రంబున నొకనావయందుంటిని. నాకా క్రూరవర్మయు
మఱినల్వురు నావికులును కట్టెదుటఁ బ్రత్యక్షమైరి. ఆనలువురు నావి
కులును హానిపక్షపువారగుటచే నే నేమిచేయుటకును నశక్తురాలనై
పోతిని. ఆత్మహత్యకై దారికొంటిని గాని సమయంబు చిక్కదయ్యె.
నలువైపుల రాక్షసులవలెఁ గావలాగాయఁదొడంగిరి. ఆక్రూరవర్మ
నన్నాడిన కర్ణకఠోరవాక్యంబులఁ దమకేమని విన్నవింపుదు మహాత్మా!

గీ. వెనుకఁ దప్పించుకొంటివి । నిను నిపుడిటు
రక్షణమొనర్ప నెవ్వరు । రారదేమొ
పాతకీ! నాయభీష్టంబు । బల్మినైన
తీర్చుకొననెంచి యీరీతిఁ । దెచ్చినాఁడ.

అని యెన్నియోవిధంబులఁ దూలనాడి నన్నేమోచేయ నెంచఁ
జేతికో నొకవిసరువిసరితిని. ఆవిసరుతోఁ గంటికిదెబ్బతగిలి బాధప
డుచుండఁగనే నావ రేవునఁ జేరె. నావికులనల్వురాతని యొడ్డునకుఁ జే
ర్చుచుండ సమయముఁ జూచుకొని వారి బాఱినిబడకుండ నెట్లో
దప్పించుకొని యీవలఁబడితిని. అతఁడీ పురంబునకుఁ జేర్చు నుద్దేశము
నాతోనిట్లు వ్యక్తీకరించెను. దేవా! అవధరింపుము—

గీ. ఆప్రదేశమేలెడు రాజు కే అబలలన్న
జాలివహింపఁబోడు కాంతయేని
ఎవఁడు పరనారులను సగ్రహించి తెచ్చి
యిచ్చువానికలోనాతని మెచ్చునట.

మాధవ—అమ్మా! ఆనావ యింక సముద్రతీరముననే నిలిచి యున్నదా!

శారద—అయ్యా! తప్పించుకొనుటకుఁ దగిన వ్యవధి లేనందున నింత వఱకచ్చటనే యుండునని తలంతును.

మాధవ—అట్లులయిన సేనాని ప్రవర్యా! వలయు రక్షకభటులను వెంటఁబెట్టుకొనిపోయి యావంచకులను బంధించి సభాస్థానమునకుఁ దోడి తేవలయును. పోయివచ్చెదరా?

సదా—చిత్తము. సెలవుఁ గైకొందును—(నిష్క్రమించును.)

మాధవ—తల్లీ! ఆద్రోహుల నితండు వెంటఁబెట్టుకొని వచ్చును. నీకింక భయము లేదుగదా! కావున నీనామధేయాదులఁ దెలుపుము నీకతఁడు మొట్టమొదట నొనర్చిన ద్రోహమునుగూడ దెలుపుము. వానియందు నేరస్థాపన మొనర్చి తగురీతి దండించవలసియున్నది.

శార—రాజా! నామధేయాదుల నావల నెఱింగింతును. కాని నాయవస్థను దెల్పుకొందు నాకర్ణింపుఁడు. నేను బాహుబలపురంబున నొకకుటీరమందే కాకిన్నై యుంటిని. నాకొక సోదరుఁడు గలఁడు.

మాధవ—(తనలో) హృదయమా! తొందరపడకుము. ఈమె నిక్కముగ శారదయే. సంశయము లేదు. (ప్రకాశముగా) సోదరీమణీ! సంశయనివృత్తురాలవై వృత్తాంతంబు సాకల్యంబుగ నెఱింగింపుము.

శార — పవిత్రాత్మా! నాకింక భయ మెందులకు ? నాతల్లి చనిపోయి నది. తండ్రి యరణ్యవాసియైపోయెను.

మాధవ — నీవు శారదవా?

శారద — అయ్యా ! నీవు మాధవనన్నవేనా ?

మాధవ — నేనెవఁడనో తెలిపెదనుగాని నీనామము నదియేగదా !

శారద — అవును. కాని మహాత్మా! నానామము దమకెట్లు తెలియును!

మాధవ — నేను బాహుబలపురంబున నున్నకాలంబున శారదయను నామెను మోసంబున నొకఁడు యెత్తుకొనిపోయెనని వింటిని. అప్పుడామెకొఱకు వెదకివెదకి వేసరి నిరాశాహతుఁడనైతిని.

శారద — అయ్యో ! ఈదీనురాలియందుఁ దనుకట్టి నిర్హేతుకజాయమానకరుణాకటాక్షము మేలకలిగె.

మాధవ — నాసోదరీమణియగుటచేత. ( చివాలున లేచి శారదను కౌఁగిలించుకొని) హా! సోదరీమణి ! శారదా ! ఎన్నిదినంబుల కు నిన్నుఁ జూడఁగల్గితి

శారద — తమ్ముఁడా ! బిక్షుకుఁడవే. నీకింతటి మహోన్నతపదవి యెట్లు వచ్చినది తండ్రీ !

మాధవ — అమ్మా ! శారదా ! నావృత్తాంతం బెఱింగింతుఁగాని తల్లీ !

గీ. పాతకుఁడు దుచ్ఛుఁడను జేత । వాతగాని
నట్టిదేబెను జెల్లెలా । యిట్టిదశను
నున్ననీమోము జూచుచు । నున్నవాఁడ
ప్రాణములగోలుపోక యీ । పగిది బ్రతికి.

గీ. చెల్లెలా దుఃఖవారిధిఁ । జేర్చి నన్ను
బాసిపోతివెయని వాడ । వాడలందు
విపినములయందుగలయంగ । వెదకివెదకి
యేడ్చియేడ్చి నిరాశచే । నిట్టులుంటి.

గీ. నిన్నుఁ గూర్చి మనంబునఁ గొన్నదుఃఖ
మొక్క తృణకాలమును విడకుండ నాకు
ధైర్యముం గలంచి యెల్లు మందమతిఁ గూర్చి
బాధపెట్టునో నామంత్రి వరుఁడు సాక్షి.

ఓ పతివ్రతాశిరోమణీ!

గీ. సివిపత్తునివారింప నేరనట్టి
యీదురాత్మునిపైఁ బ్రేమ మేలనమ్మ
కూల్చఁగదవమ్మ శాపవాక్కును బ్రయోగ
మొనరఁగాఁ జేసి తీరిపోవును ఋణంబు.

చెల్లెలా! కనుపించినవారి నెల్లర నడిగితిఁ గాని యొక్కరును సరియగు సమాధాన మొసంగరైరి. ఆహా! దుర్మార్గుఁడా క్రూరవర్మ యెంతటి ద్రోహంబునకుఁ బూనుకొనియెను? తల్లీ! నాకోరినరీతి శాపవాక్కును విడచుటకుఁ బూర్వము నాకొక్క కోరిక గలదమ్మా. ఏదందు వేని.

చ. చటులతరప్రకోపమున శస్త్రముఁ దాలిచి యీదురాత్మునిన్
గుటిలను ముక్కముక్కలుగఁ గోయుచుఁ బక్షిసమూహమెల్ల మె
క్కుటకెగురంగ వైతునిటు క్రూరులనున్ క్షమియింపరాదు యి
క్కటులకుఁ గారకుండితఁడు గావున దేహము తొందరించెదన్.

శార — అగ్రజా! నాకే యంతటి యాగ్రహము జనించెనుగాని అను
దాననై, నిరాయుధురాలనై యొంటరికత్తెనై యేమిచేయుటకును నిరాధారురాలనై పోతిని. నేనుఁ గూడఁ బరనారీమణిరీతి వంతల పాలొనర్చిన యీదురాత్ముని,

గీ. పట్టిబంధించి తెచ్చి భూభారమడచి
క్షత్రియాళిలంబునందు యశస్సుఁ గూర్చఁ

పీప్రలను మాలికగ దాల్చు । వీరుఁడెవఁడు
గలఁడొకో యన్న శాంతము । గలిగియుంటి.

అట్టియాశ నేఁడు సార్థకంబగుట చిత్తంబున శాంతివొడముచున్నది. మాధవా! నా శాంతంబునకు మఱియొకకారణముగలదు. ఏమందువా?

గీ. ఎవఁడు లేనివేళ । నీచురాత్ముఁడు నన్ను
తస్కరించి యింత । దాఁక దెచ్చె
అట్టిదానిచేతి । కాపాపిచిక్కుల
సంభవింపఁ జిత్త । శాంతిఁ జెందె.

మాధ—అవునమ్మా అవును. కాని చెల్లెలా! నీవు వివాహితవైనట్లుగ న్నటుచున్నదానవు. నిన్నుఁ జేపట్టిన వీరుఁ డెవ్వఁడమ్మా! ఛీ! ఆతండు వీరుఁడే కాఁడు. వీరుఁడే యైనచో,

గీ. భార్యపరులచేత । పరిభావమందుట
చూచుచూరకున్న । నీచుఁడగునె
అట్టిమందునట్లు । చెట్టఁబట్టితివమ్మ
తెలిసి గోతియందు । దిగినయట్లు.

శార—అన్నా! సకలసద్గుణగణనీయుండగు నమ్మహానుభావుని యట్లు తిరస్కరింపకుము. ఏమందువా? నారాసమయంబున నట లేరని యీవరకే విన్నవించితిఁగదా? నా చేయున్నచో?

గీ. క్షత్రియాండౌట వంశ । విఖ్యాతినిలుప
హాదబన్నంబు లగించి । నారు మొదట
అట్టివారట్టి తుచ్ఛ కా । ర్యంబు జరుగ
చుండ చూచుచుఁ దా మూర । కుందువారె.

అంతియగాక నాసమయంబున నారటలేకుండునట్లు జేసి శ్రీ

న్నారాయణమూర్తి నాకుపకారమే యొనర్చినాడుగాని అన్యాయ మొనర్పలేను. నాభర్తగారచ్చటనే యుండి యీ కార్యమంతయు జరిగినచో నాతుచ్ఛుఁడు మీ చేతులఁబోఁ బ్రతుకుటగాని మన యిరువురకుఁ బునస్సమాగమ భాగ్యంబుఁ జేకూరుటకుఁ గాని వలనుబడకుండెడిది గదా?

మాధ—అమ్మా! నీపతి యంతటి ప్రజ్ఞాన్వితుఁడా? అతఁడెక్కడకుఁ బోయినాఁడు, వానిదర్శనభాగ్యంబు నాకెట్లు లభించును!

శార—అన్నయ్యా! నాకును నదేశంక వొడముచున్న యది. వారునన్ను గొనిపోవుటకై యీమిత్రుని యింటికివచ్చి యీయుదంతం బంతయు నాలించి యేగతి విచారమందుచుండిరో, యేయే తావుల వెదకుచుంటిరో, యేక్రియనల్లాడుచుండిరో గదా,

మాధ—అమ్మాయీ! అందునగూర్చి విచారపడకుము.

గీ. వలయువారల వెదకంగఁ బంపి నీపె
నిమిటిఁదెప్పించియిప్పింతు నిజముతల్లి
తొలఁగెఁగష్టంబులికసం తోషపడెడు
దినములును వచ్చెనమ్మచిం తిలకుమమ్మ.

(అంత రాజభటుఁడు ప్రవేశించి,)

రాజభ—దేవా! దేవరదర్శనార్థమై యొక వీరపురుషుఁడు వచ్చి ద్వారముకడ నిలిచి యున్నవాఁడు.

మాధ—సత్వరముగఁ బ్రవేశపెట్టుము.

రాజభ—చిత్తము (నిష్క్రమించును)

మాధ—అమ్మా? శారదా! ఎవ్వరోనాదర్శన మభిలషించి వచ్చుచున్నవారట. నీవు లోనికిఁబొమ్ము. వారితో ముందు సంభాషించి పంపివచ్చెదను.

శారద—మంచిది (నిష్క్రమించును)

కీర్తి—(రాజభటునితోఁ బ్రవేశించి) మహారాజా వందనము.

మాధ—అయ్యా! ఆపీఠముపైఁ గూర్చుండుఁడు ?

కీర్తి—(కూర్చుండి) మహాప్రభూ! మహారాజసందర్శనార్థమువచ్చునప్పుడూరకవచ్చుట క్షత్రియపురుషున కుచితముగాదని యీ కానుక సమర్పింపఁదెచ్చి యున్నాఁడ! (అని శిరస్సు నొకదాని నిచ్చును)

మాధ—ఓవీరపురుషాగ్రణీ! తమ చరిత్రంబతిచిత్రంబుగనున్నయది. మహారాజసందర్శనార్థము వచ్చునప్పుడు కానుకగా శిరమును దెచ్చి సమర్పించుట సవీనాచారమేగదా. ఇందులకుఁ దామే మొదటివారు. అయినను గారణము లేకఁ దామిట్టిపనికిఁ బూనుకొనరని యనుకొనియెదను. పురుషసింహా!

గీ. తా మెవరో? యేడనుండియింతే దాకవచ్చి
నారో? యీశిర మెవరిదో తె వాకుఁదెలిపి!
సంతసముసంగుమ య్యనా తె స్వాంతమునకు
క్షత్రియకులాబ్ధిచంద్ర తె యశస్సముద్ర.

కీర్తి—అయ్యా! నేను ప్రస్తుతము శ్రీనగరమునుండి వచ్చుచుంటిని. శిరంబు కుమారదన్నదీ; అతని జన్మ మతిక్రూరమైనది. అట్టి మహాద్రోహిని జీవింపనిచ్చుట భూభారంబని యెంచి మత్కరవాలంబున కెఱఁజేసి దేవరవారి పారితోషికమంద నిటకు వచ్చితి.

మాధ—(లేచి కౌఁగిలించుకొని) అయ్యా!—తామిక్కార్యమొనర్చి నాభారమును దొలఁగించినందులకు మీకనేకవందనంబు లాచరించుటకంటె నేసేయఁగలపారితోషికమే ముండును? అ

యినను దామభిలషించు పారితోషిక మెట్టిదియో సెలవిచ్చిన సమర్పించుకొనుటకు సిద్ధుఁడనై యున్నాఁడను.

గీ. కరులో హయములో తగినరో కనకాంబరరత్న
మయవిభూషణములో లేక మంత్రిపదవి
యో వచించినఁ దీర్చెద నో విశుద్ధ
చరిత దాపకఁ దెలుపుము సంతసింతు.

కీర్తి—అయ్యా! మందమతినై మనసు మనసులో లేకఁ బారితోషికము మాటయెత్తితిని గాని వేఱుగాదు, నాకేటికీ పారితోషికములు?

గీ. ఆకురాత్మునిగూల్చిన యాగ్రహంబు
బాయకుంటను బొరపాటు వలనఁజారి
నాఁడ నామాట నెంటని నాఁడనోట
పరితోషికమేల భూపాలవాకు.

వధావిధానంబంతయు నెట్లుండినను వధయొనర్చినస్థలంబు తనుపరిపాలనలోని దగుటవలన నీశీర్షంబుఁ దమకుఁ జూపించి పోవలయునని తెచ్చినాఁడ.

మాధ—ఆర్యా! తమనామధేయమును దెలుపరైరి. ఊరేదియో యెరుంగఁజేయరైరి. విపరీతములగు ప్రత్యుత్తరము లిచ్చుచుండిరి.

కీర్తి—దేవా! నాపేరు కీర్తివర్మయందురు. నా కాపురంబు విక్రమార్కపురంబు. కారణాంతరమున నేను శ్రీనగరంబునకుఁ బోవుచు నాసతీమణిని నా ఆబాల్యస్నేహితుండగు లక్ష్మణవర్మ యింట దిగవిడచిపోతిని. నేను మఱలవచ్చువఱకు నెవ్వరోచోరులామెను దస్కరించుకొనిపోయినట్లు తెలిసినందున నామెకొఱకు వెతకుచు నరణ్యంబులు పట్టణంబులు దిరిగితిరిగి వచ్చుచుఁ గట్టకడకీపట్టణంబును గూడ జూడవలయునను దలం

పుత్తో నొక తెప్పకొయ్య నాధారముఁ జేసికొని సముద్రతీరముననే యీదుకొనుచుఁ గొంతదూరము రాఁగా నదృష్టవశంబున యీదురాత్ముఁడొక నావపైఁ బోవుచుఁ గన్పడె. అంతనెట్టు లెట్టులో నానావఁ బట్టుకొని లోనఁజేరి మదీయబాహుబలపరాక్రమంబున నాదురాత్ముని నావికులను మదీయనిశితకరవాలంబునకు బలియిచ్చి యానావతో యిటకుఁ జేరి దేవరను దర్శింపఁ గల్గితి.

మాధ—తమ సతీమణిపేరు శారదయా!

కీర్తి—దేవా! అవును; తమకీనామ మెట్టులఁ దెలియవచ్చినది.

మాధ—ఆమె నాసోదరీమణి యగుటచేఁ దెలియును.

కీర్తి—(కౌగిలించుకొని) బావా! నీవేనా? మాధవవర్మవు. ఎన్నాళ్ళకుఁ జూడఁగల్గితి, నీముఖపరిచయము నాకెన్నఁడును లభించకపోవుటచే గుర్తింపనైతిని. నన్ను క్షమించుము

మాధ—ఆర్యా! నేనును అట్టి దశయందే యుంట నిరువురమును సమానులమే యైతిమి. ఇందు నే క్షమించఁదగినదేమున్నది? బావగారూ! శారదయిటనే యున్నది. మీరొక్కరే యని వచించి పారితోషికమును గూర్చి విరక్తిభావమును సూచించిరి గదా? కావున, నేనామెనే మీకుఁ బారితోషికముగా సమర్పించుకొనుచున్నాఁడ ననుగ్రహింపుము! (బిగ్గఱగా) అమ్మా! శారదా! శారదా!

శార—(ప్రవేశించి) ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! (కౌగిలించుకొనును.)

కీర్తి—(ఆనందబాష్పములతో) ప్రేయసీ!

మ. అనుకోనైతిని వెండి నిట్లు గనుభాగ్యంబబ్బు నాకంచు నే
ననుకోనైతిని నీసహోదరుఁడు మద్రాజ్యాధీశుఁడై యుంటఁ జూ

తునటంచుఁ దలపోయనైతినిమరా । త్మ్రుందుఁగుంచియీరీతి వ
త్తును నేనిచ్చటికంచునన్నియునుచే । సిఁగ మోదముఁ గూర్చెఁగా.

భావగారు! తమకృతజ్ఞతను నేనెట్టి ప్రత్యుపకారముఁ జూపింపవల యునో యోచకున్నయది?

మాధ—ప్రత్యుపకారమేరీతిని జూపింపవలయునని యాలోచించుట? చూడుఁడు.

గీ. నాకుముఖ్యమంత్రిగనుండి । నాదురాజ్య
వైభవంబులనెల్లగా । పాడునుండి
యండగానుంటయేజా । లునయ్య అదియే
ప్రత్యుపకృతిగానెంతు । భావనుండు

కీర్తి—శ్రీసగరమహారాజుగారి కొలువుఁ జేయు నేనిచ్చట నెట్టులుండ గలను చెప్పుఁడు!

గీ. మోసమొనరించిమన్నులఁ । బాసిపోయి
పరులపంచలఁ జేరెనా । పాత్రుఁడుండు
క్షత్రియకులంబునందుమ । చ్చనొకదాని
బెట్టెనంచును చీవాట్లఁ । బెట్టరొక్కొ

మాధ—ఆర్యా! నీవందులకై విచారింపవలదు. అతఁడు మనకుఁ గప్పముగట్టుచు మాయధికారమునకు లోఁబడియుండు వాఁడగుటచే వానియామకమును దప్పక యంగీకరించితీరును. అంతియగాక యీవృత్తాంతంబొక లేఖ వ్రాసి మన యమాత్యుఁడైన సదానందులవారిని వానియొద్దకుఁ బంపించెద.

కీర్తి—మీయాజ్ఞకు నేనన్యథావర్తింపఁగలనా? అయినను సిట్లొనర్చిన బాగుగానుండునేమో యని తలంచెద!

గీ. స్వయముగాఁబోయి మాధవ ♦ వర్మతనదు
ముఖ్యమంత్రిగ నొనరించె ♦ భూవిభుండు
గాన యంగీకరింతు ర ♦ మేనిపోయి
వత్తునని చెప్పివచ్చిన ♦ బాగుగాదె!

మాధ— నీయూహ యుక్తియుక్తముగానున్నది. అట్లయిన నెల్లుండి పోయి రావచ్చును.

కీర్తి— (భార్యవంక దిరిగి) ప్రేయసీ! నాకొఱకై యెంతవిలపించి యే గతి నిట్టులఁ జేరఁగలిగితివో యెఱుఁగఁజాలకున్నాఁడఁగదా! వినఁదగుదునేని తత్కథావిధానంబంతయు నెఱింగింపుము.

శార— ప్రాణేశ్వరా! తత్కథావిధానంబేమని యెఱింగింతు కావలసి నకారణార్థంబు లవంబునుదప్పదుగదా! ఏది యెట్టులజరిగినను యీశ్వరమహిమమునఁ జేరుకొనవలసిన చోటునఁ జేరి కష్టంబు నెల్ల గడచితిమికదా!

గీ. నన్నుహరియించి యింత వం ♦ తలనుబెట్టి
నాచరిత్రము నిలనొక్క ♦ నాటకముగ
నాడఁజేసెఁ గుమారుఁడీ ♦ యువతిబాసి
పోమె కష్టంబులును దీరి ♦ పోయెఁగాదె.

అందుకుఁ దదనుకూలముగనే ప్రాణపతీ! అటుజూడుము.

గీ. హృదయతాపంబడంచి మా ♦ మదికి చల్లఁ
దనముఁ బోషింపవచ్చుచుం ♦ టెనియటంచు
గగనమందుననదె శీత ♦ కరుఁడుతనదు
రాక నెఱిఁగించుచున్నాఁడు ♦ ప్రాణనాథ!

(అంత సదానందులవారు ప్రవేశించి)

సదా— దేవా! తమయాజ్ఞనుసారముగ సముద్రతీరమునకుఁ బోయి చూడ మా కెంతను నానగాన్పడదయ్యె. నాపకొఱకు సముద్రా

తీరము పొడుగునను చాలదూరముపోయి చూచితిమిగాని యెుకనును జాడలేదయ్యె. అంతయాశనిరాశచేసికొని మఱలివచ్చుచుండ మఱల రేవునందు రక్తపూరితమైన యొకనావగానిపించి:ది. లోనికింబోయి చూచితిమి. మనుష్యులజాడ లేదయ్యె. దేవర కీవర్తమానమెఱింగింపవచ్చితిమి.

మాధ—అయ్యా! తమరుచాలశ్రమపడితిరి కాని యానావయందుం గల హరాత్ముని వధియించి తెచ్చిన వీరపురుషుండితండే. ఆతుచ్ఛుని శిరంబిదిగో నాకుం గానుకగా నొసంగి యున్నవాండు. ఈశూరాగ్రేసరుండే యీామెను పరిణయంబైనది? తామిట నుండి వెడలినయనంతరంబున నీసుభాంగి చరిత్రసారముచుండ నార్యా—ఈమె యెవ్వరో తెలియునా!

గీ. ఏసతీమణి కొఱకయి యింతదాక
నేడ్చి తమతోడనే వచి యుంచినాను
ఆసతీమణి నాచెల్లె లయ్యియామె
చక్కదనముల కిక్క మా శారదాంబ.

సదా—(సంతోషముతో) దేవా! నేండు కనుసుదినము. సుగుణచారిత్రులగు నీదంపతులం గాంచుటచే నాజన్మముతిధన్యము. ఓ దంపతులారా! వందనంబులు.

కీర్తి—ఆర్యా! తాము మాకు పరిచితులయ్యునేండిటమిమ్ము సందర్శించుటచేత మేమిరువురమును ధన్యులమైతిమి.

సదా—దేవా! నాదొక విన్నపము గలదు.

గీ వార్ధకమువచ్చె నిమంత్రి పదవినుండి
తగువిరామము పొందఁగఁ దలఁచినాఁడ
నిమ్మహానీయు మంత్రిపదమ్మునందు
నిలిపి నాకుంబ్రమోదంబుఁ గొలుపవలయు!

కీర్తి—ఆర్యా! మీరుఁగూడ మాభావగారి పక్షమే యవలంబించితి రా? మహాత్మా! పెద్దలవాక్యంబులు శిరసావహించుట నావిధ్యుక్తధర్మమేయైనను నొక్క విన్నపముఁగలదు.

గీ. బాలురము మేము మీరలు ౹ వయసునందు
బుద్ధియందున పెద్దలు ౹ మొదటనుండి
రాజ్యతంత్రము లెఱిఁగిన ౹ పెద్దలగుట
నుండఁగానుండి గాపాడు ౹ చుండవలయు!

మాధ—భావా! నేనడుగఁదలచినదియుఁ గూడ నదియే. అయ్యా? సదానందమూర్తీ! మాయభీష్టమీడేఱ్పననుజ్ఞ నొసంగ వలయును.

కీర్తి—దేవా! రాజోత్తమా! తమకీరాజ్యప్రాప్తి యెట్లులగల్గినదో బంధువుగుఁడనయ్యు నాకెఱిఁగింపక పోతివి.

మాధ—అదంతయు నొక భారతమంతగ్రంథముకలదు. ఇప్పుడు కదిపిన తిరుగని యీచరిత్రమును భోజనానంతరమున తెలుపుకొందును సరియా.

కీర్తి—చిత్తము.

రాజభటు—(ప్రవేశము) దేవా! ఎవ్వరో వీరవర్మగారఁట. దర్శనార్థము హాజారముకడనున్నవారలు.

మాధవ—సదానందమూర్తి—వారే మామేనమామలు. తామెదురేగి తోడ్కొని రావలయును.

సదా—చిత్తము.

(వెడలి వీరవర్మతోఁ బ్రవేశము.)

మాధ—(లేచి ఎదురుగాఁజని) మామా నమస్కృతులు.

వీర—చిరాయుష్మాన్ భవ.

మాధ — మామా! ఈపీఠమలంకరింపుము.

వీర — (కూర్చుండును)

మాధ — అమ్మా శారదా! భావకీర్తివర్మా! దేవా! సదానందమూర్తీ! వీరు మా అమ్మగారికి సోదరులు. మఱియు

ఉ. ఆగతిబిచ్చగాడనయి । హాసుగుణంబులరాశి? శారదా?
ఏగతి నేర్చుచుండె యెటు । లేగితివో యని యేర్చుచుండనా
భాగును జూడఁగానటకు । వచ్చిన దేవ్రుడితండె రానిచో
నాగతియేమియౌ నొగద । నాకిటు రాజ్యపదంబువచ్చునే

తల్లి శారదా.

గీ. తల్లి తరువాతఁ దల్లియం । తటిమహాత్ముఁ
డితఁడు మనమేనమామ నా । సుతుని కంటె
ప్రేమముంజూపి పోషించి । విద్యలెల్ల
నేర్పఁజేసినవాఁడు గం । టివా! శా: చెల్లి.

వీర — నాయనా! మాధవవర్మా? ఈమెయేనా చెల్లి. నాఁడుహరియింపఁబడిన దీనుగుణంబులరాసియేనా! (దగ్గఱకుదీసికొని) తల్లీ! శారదా! పేరునకు మేనమామనుగాని నే బ్రతికియున్న నేమి? చచ్చిన నేమి?

గీ. కష్టదశయందు మిమ్ముల । గావగా న
శక్తతనుజూపి యీనాఁడు । సకలసుఖము
లనుభవించుటఁ గని బందు । గుఁడనటంచుఁ
జెప్పుకొనన్నోరు విప్పిన । చెనటినమ్మ.

తండ్రి — మాధవవర్మా! అజ్ఞానురాలై మేనయత్త యొనర్చిన యపరాధంబు క్షమించి నాయనుంగు కూఁతురైన ఈశారదను వివాహమాడి మాకెల్లరకు మోదముఁగూర్చవేఁడువాఁడ.

సదా.—దేవా! మేనమామలవారి యాజ్ఞ యవశ్య మాచరణీయము. తాము మా కెల్లఱకుఁ బ్రభువులరై యింత కాలము బ్రహ్మచర్యము నుండుట మాకే విచారకరముగనున్నయది.

శార—అన్నగారు సత్వరంబ మామగారియాజ్ఞ నాదలఁదాల్చి మా వదినెగారితోఁ గూడి సుఖంబుగ కాలంబు గడుపుకొను భాగ్యంబుగలుగఁ జేయుఁడు.

కీర్తి—బావగారు! సర్వజ్ఞులరగు తమకు వేఱుగ నేను దెలుపవలసినదే మున్నది.

మాధ—మీ రెల్లరును యీవిషయంబున నేకాభిప్రాయులగుట జన వాక్యం కర్తవ్యమ్మను నార్యసూక్తిని మీ యాజ్ఞశిరసావహించుచున్నాఁడ. మనకుఁ గాలాతీతంబగుచున్నయది. ఇంక లోనికిఁ బోవుదుమా? సదానంద దేవా! మీరుగూడ మాతోడి పాటు విందారగింప వేఁడెద.

సదా—చిత్తము.

మాధ—సదానందమూర్తీ! మామగారు! బాలుఁడను. నూతనముగ రాజ్యపదవి నందినవాఁడను. చిరకాలమునకు బందుగుల నందఱిని కలిసికొన్నవాఁడను. కాన మీయాశీర్వచనము ముఖ్యముగ నాకుఁ గావలసియున్నది.

గీ. ప్రజలు నారాజ్యమున సౌఖ్య పడుచు సర్వ
సంపదలఁ గూడ యలరార సంతసంబు
గూర్చుగావుత నాకెట్టి కొఱత లేక
నీప్సితంబులు సతతము లభించుఁగాత.

సదా—తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు.)

—:సంపూర్ణము:—

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B166 |
| పుస్తకం పేరు | శారదావిజయము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసేవది | Aswini |
| పేజీలు విడదీసేవది | Thasin |
| స్కాన్ చేసేవది | Mounika |
| పరీక్ష చేసేవది | ROHITH |
| పేజీలు సరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | good |